# పూలపొట్లాలు

పిల్లల కథలు





రెడ్డి రాఘవయ్య



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్

POOLA POTLAALU - Childrens Stories
By : REDDI RAGHAVAIAH
Published by : Director & Special Officer, A.P.Balala Akademi,
c/o Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad-500 004.

ప్రచురణ సంఖ్య : 87
మొదటి ముద్రణ : 1993
ప్రతులు : 5000

వెల : రు. 6-00



ముఖచిత్రం,
బొమ్మలు : కరుణాకర్

టైప్ సెట్టింగ్:
ప్రసాద్ గ్రాఫిక్స్
హైదరాబాద్

ముద్రణ :
కళాజ్యోతి
హైదరాబాద్

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
జవహర్ బాలభవన్
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్-500 004

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషి చేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

శారదా అశోకవర్ధన్
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

ఇందులో

1. మారిన అలవాటు

2. పోటీ ఫలితాలు

3. పూలపొట్లాలు

4. తృప్తి

5. పెన్సిలు పరిశోధన

6. మంచి ధనం

7. తల్లి మనసు

8. రామన్న కథ

# మారిన అలవాటు

"అందరూ రండీ....... ఆనందించండి".

"సీనుగారి మొఖంలో సీమటపాకాయ చిటపటలు. భూ చక్రాల చరచరలు.చిచ్చుబుడ్ల తుస్... బుస్‌లు." సమయం: ఎప్పుడైనా. స్థలం: 7వ తరగతి 'ఎ' సెక్షను."

ఈ ప్రకటన స్కూలు గోడమీద ఎవరో రాశారు. స్కూలులోకి వెళుతున్న సీనూ... అంటే శ్రీనివాసరావు ఆ ప్రకటన చూడలేదు. అతడెప్పుడూ అటూ ఇటూ చూడడులెండి. తాను చేస్తున్న పని పైననే ఏకాగ్రతగా ఉంటాడు.

"ఒరేయ్! సీనూ ఆగరా' ఆగు. ఇది చూశావా?" వెనుకనుండి వస్తున్న 'సత్తి'గాడు అంటే సత్యనారాయణ - అన్నమాట. సీనును పిలిచాడు. గోడమీది ప్రకటన చూపించాడు.

సీనూ చూశాడు. విస్తుపోయాడు. ఉడికిపోయాడు. ఉన్నట్లుండి ఊగిపోయాడు. పళ్లు కొరుక్కున్నాడు.



అసలు ఇంతకు ఆ ప్రకటన ఎవరు రాశారు? సీను అంటే గిట్టని వాళ్ళు రాశారు. సీనూ అంటే అసలు ఎందుకు గిట్టదబ్బా?

సీను అదే శ్రీనివాసరావు మంచి అబ్బాయి. క్లాసులో అందరి కంటే మిన్నగా ఉంటాడు. అసలు క్లాసులో ఏమిటిలెండి. అసలు ఆ స్కూలులోనే అతడు మిన్న అనుకోవచ్చు.

కథలు చెబుతాడు. కథలు రాస్తాడు. ఉపాధ్యాయులు వేయించే నాటకాలు ఆడుతాడు.

మోడల్ పార్లమెంటులో - పాఠశాలలో అన్నమాట - ప్రధాన మంత్రిగా ఉంటాడు.

స్కూలు ఆటలో ప్రధానోపాధ్యాయుడిగా ఉంటాడు.

అతడి రచనలు స్కూలు మాగ్‌జైనులో వస్తాయి. ఒకటి రెండు కథలు ఓ పిల్లల పత్రికలో కూడా అచ్చయాయిలెండి. అందుకని ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడి దగ్గరనుండి, అందరు ఉపాధ్యాయులూ..... అతడంటే 'మక్కువ' చూపుతారు. ప్రతిదానికీ అతడిని ముందు పెడతారు.

అందుకనేలేండి మరి! సీనూ అంటే కొందరికి గిట్టనిది. ఆ గిట్టని వాళ్ళే అతడిని ఉడికించాలని ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూ ఉంటారు.

అటువంటి వాటిల్లో ఈ ప్రకటన ఒకటి.

'ఆ ప్రకటనతో సీనూ ఎలా ఉడుక్కుంటాడు?' అని అడుగుతారుకదూ మీరు? చెబుతాను వినండి.

సీనూ ఆ స్కూలులో ఏడవ తరగతి చదువుతున్నాడు. అతడి మంచితనం గురించి పైన చెప్పుకున్నాం. కాని అతడిలోకొన్ని 'దురలల వాట్లు'....(క్షమించండి ఆ దురలలవాట్లు సీనూ దృష్టిలో మంచివేనండి మరి.) కూడా ఉన్నాయి.

ఇంతకీ ఆ 'దురలలవాట్లు' ఏమిటనుకుంటున్నారు. సీనూ పెదాలు ఎప్పుడూ తెల్లగా ఉంటాయి.

ఇది ఏమంత పెద్ద అలవాటు కాదనుకోండి. ఇంకొకటి ఉన్నది. అసలైన అలవాటు. అదే మొఖం చిటపటలాడించటం. కళ్లు చికిలించటం. చెవులు రిక్కబొడవటం. అప్పుడప్పుడూ చిరచిరలాడటం. ఇవండీ అసలు ముఖ్యమైన దురలలవాట్లు.

అప్పుడు చూడాలి అతడి మొఖాన్ని, దానిలోని అందవికారాన్ని.

'ఈ పద్ధతి మంచిదికాదని' వాళ్ళ నాన్న ఎన్నోసార్లు చెప్పాడు. వాళ్ళమ్మ దానిని గురించి అంటే సీనూ మొఖాన్ని చిటపటలాడించినప్పుడల్లా..... కేకలు వేస్తూనే ఉంటుంది.

"ఓరేయ్! మొఖాన్ని అలాపెట్టటం మంచిదికాదురా! కాస్తమంచి తనం నేర్చుకోరా!" అని.

"ఆయ్!" అంటాడు సీనూ.

తన పద్ధతిమాత్రం మార్చుకోడు.

ఎవరుమాత్రం ఏంచేస్తారుచెప్పండి. అతడికి అదొక మంచి అలవాటు. అయిందా!

ఆ ప్రకటన చదివిన సీనూ..... గబగబా క్లాసులోకి వెళ్ళాడు. ప్రకటన అక్షరాలు గుర్తుపట్టి అది ఎవరు రాశారో ఊహించుకున్నాడు.

"తప్పకుండా అది 'యాది గాడి'- అంటే - యాదగిరి పనే"! అని అనుకున్నాడు.

యాదగిరి క్లాసులో తన మిత్రబృందం మధ్యన కూర్చొని ఉన్నాడు. కూర్చున్నవాడల్లా సీనూను చూచి వెకిలిగా నవ్వాడు. చాటుగా కొక్కరించాడు. అతనితోపాటు మిత్రబృందం కూడా వంతపాడింది.

అప్పటికి ఇంకా 'టీచరు' రాలేదు.

అందుకనే వాళ్ళకు అప్పుడు 'ఆటవిడుపు' లాగా ఉన్నది. ఉన్నట్లు ఉండి మిత్రబృందం గొల్లుమన్నది.

సీనూ అదిరిపడబోయి తమాయించుకున్నాడు. పుస్తకం ఒకటి తీసుకొని చదువుకోవటం సాగించాడు.

ఇంతలో టీచరు వచ్చారు.

పాఠాలు అయాయి.

స్కూలు వదిలారు.

నేరుగా సీనూ ఇంటికి వెళ్ళాడు.

ఆరోజు అతడి మనస్సంతా అదోలా ఉన్నది.

వాళ్ళ అమ్మ "అరేసీనూ! దుకాణానికిపోయి....." అని అన్నదో లేదో.....

సీనూ ఎగిరిపడ్డాడు.

'పెద్ద' కోపం వచ్చేసింది.

"ఎప్పుడూ నేనే తేవాలా? ఇప్పుడు నేను చదువుకోవాలి" అని అన్నాడు.

వాళ్ల అమ్మ ఊరుకోలేదు.

కోపగించుకున్నది.

సీను అంతకంటే గొప్పగా కోపగించుకున్నాడు. చిటపటలాడాడు. చిరచిరలాడాడు. చెవులురిక్కించాడు. కళ్లు చిలికించాడు. మొఖం చిట్లించాడు. మన అవతారం - అదే - దుర అలవాటు అవతారం ఎత్తాడు.

అలా శివ మెత్తిన సీనుకు స్కూలుగోడమీది ప్రకటన జ్ఞాపకానికి వచ్చింది.

అదిరిపడ్డాడు.

"అయ్యో!" అనుకున్నాడు.

అంతలో ఎదురుగా గోడమీద అద్దం ఉంటేదాని వైపు తన దృష్టి మళ్లించాడు.

అద్దంలో అందంగా కనుపించవలసిన మొఖం అందవికారంగా కనుపించింది.

కళ్ళు చికిలించుకుపోయి 'గుడ్లగూబ' కళ్లలాతయారయ్యాయి. ముక్కు నిక్కబొడుచుకొని 'గుడ్లగూబ' ముక్కులా తయారయ్యింది. అతడికి అంతా అసహ్యంగా కనుపించింది.

"అయ్యో!" అని మళ్లీ అనుకున్నాడు.

ఆ అవతారం చాలించాడు.

ఇప్పుడు మళ్లీ అద్దంలో మొఖం చూచుకున్నాడు. అందంగా కనుపించింది.

హాయిగా నవ్వుకోబోయి అమ్మను చూచి ఊరుకున్నాడు. ఆలోచించాడు.

"ఇందాకటి తన మొఖానికీ.....ఇప్పటి తన మొఖానికీ ఎంత తేడా!" అనుకున్నాడు.

"ఇందుకేనన్నమాట. మొఖాన్ని చిటపట లాడించినప్పుడు అందరూ అనుకునేది." అని ఊహించాడు.

"అందుకే గదా! యాదిగాడి ముఠా నన్ను అవహేళన చేసేది. స్కూలు గోడమీద ప్రకటన రాసింది." అని బాగా ఆలోచించాడు. చింత పడ్డాడు.

"ఇకనుండీ మొఖాన్ని చిటపటలాడించగూడదు. ప్రశాంతంగా ఉండాలి. తనకు మంచిదయిన అలవాటును, దురలవాటుగా మార్చుకోవాలి" అని నిర్ధారించుకున్నాడు.

అమ్మ చెప్పిన పని వెంటనే చేశాడు.

అతడిలోని మార్పుకి ఆమె ఆశ్చర్యపోయింది.

సీనూ వెంటనే చదువులో మునిగిపోయాడు.

మరుసటిరోజు స్కూలుకు వెళ్లాడు. చాలామంది తన వంక వింతగా చూడటం గమనించాడు.

అతడికి ఉడుకుమోతు తనం వచ్చింది.

తన అలవాటు అస్త్రం ప్రయోగించబోయాడు. దానిలోని వికృతాకారం, ఎగతాళిచేస్తున్నట్లు కనుపించింది. ఊరుకున్నాడు.

ప్రశాంతంగా చిరునవ్వులు కురిపిస్తూ ఉండిపోయాడు. ఆరోజు అంతా అదే మాదిరిగా ప్రవర్తించాడు.

చాలామంది పిల్లలు 'సీను గారి మొఖంలో సీమటపాకాయులకోసం' ఆశగా చూశారు. అనుసరించారు. అవహేళన చేశారు.

సీనుమాత్రం ఆ 'దుర అలవాటును మళ్లీ అనుసరించలేదు.'

అనాడేకాదు. ఏనాడూ దాని జోలికేపోలేదు. పిల్లలు హతాశులయ్యారు.

ఈనాడు అతడు హాయిగా ఉన్నాడు.

అతడి ఈ 'దుర అలవాటు'ను మార్చినందుకు 'యాదిగాడి'నీ .... వాటి బృందాన్నీ ఎంతో.... లోపలమాత్రం .....కొనియాడుకున్నాడు సీను.*

# పోటీ ఫలితాలు

ఫణిబాబు స్కూలునుండి ఇంటికి వచ్చాడు. రాగానే పోస్టులో వచ్చిన బల్లమీద ఉన్న పిల్లల పత్రిక చూశాడు. ఆత్రంగా తీసుకొని.. గబగబా దానిలోని బొమ్మలు చూడటం సాగించాడు. పేజీలన్నీ ఒక్కటొక్కటిగా కదిలివెళ్లిపోతున్నాయి.

అతడి దృష్టి ఒక పేజీలో ఆగిపోయింది.

ఆ పేజీలో కథల పోటీకి సంబంధించిన ప్రకటన ఉన్నది. ఆ పత్రికవారు 'పిల్లలను ఉత్సాహపరచటానికి 'కథల పోటీని పెడుతున్నారు.

ఫణిబాబు అదిచూసి ఆనందంతో గంతులు వేశాడు.

అతడు కథలురాస్తాడు. బొమ్మలు గీస్తాడు. రెండు మూడు చిన్న కథలు పిల్లల పత్రికలలో అచ్చు అయ్యాయికూడా! ఇంకేం....పోటీకి కథ తయారుచేయాలనుకున్నాడు.

అతడు ఆలోచనలో పడ్డాడు.

ఆ రోజంతా ఆవిధంగానే గడిపాడు.

ఇతివృత్తం పిల్లలకు సంబంధించినదై ఉండాలట. అదీ స్కూలులో జరిగిన సంఘటన అయితే బాగా ఉంటుందట.



ఫణిబాబు రాత్రి భోజనం కూడా సరిగ్గా చేయలేదు. నిద్రకూడా సరిగ్గా పోలేదు. కలవరింతలతో కలత నిద్రపోయిన అతడికి తెల్లవారుగట్ల ఒక ఆలోచన వచ్చింది.

మంచి ఇతివృత్తం అనుకున్నాడు. గబగబాలేచి కాగితం, కలం తీసుకుని కథ రాశాడు.

దానిని రెండుమూడుసార్లు చదివిచూసుకున్నాడు. మార్పులూ... చేర్పులూ చేశాడు. ఆరోజు స్కూలుకు పట్టుకు వెళ్ళాడు.

స్కూలులో వాళ్ళ తెలుగు మాష్టరుగారు ఉన్నారు. ఆయన పిల్లల కోసం పుస్తకాలు రాశారు. ఫణిబాబును కథలు రాయుమని ఎప్పుడూ ప్రోత్సహిస్తూ ఉంటారు. పోటీకి రాసిన కథను ఆయనకు చూపించాడు.

ఆయన పూర్తిగా చదివాడు.

"భేష్! భలే బాగా ఉంది కథ. పోటీకి పంపించు." అని తెలుగు మాష్టారు మెచ్చుకున్నారు.

ఇక అక్కడినుండి ఒకటే ఆరాటం.

"పోటీ ఫలితాలు ఎప్పుడు తెలుస్తాయి? ఎప్పుడయినా కథకు బహుమతి వస్తుంది?"అని ఒకటే ఆలోచన.

అనుకున్నట్లుగానే రోజులు గడిచాయి. ఫణిబాబు ఒకరోజు పత్రిక ఆఫీసుకు వెళ్లాడు.

"ఏమండీ! కథల పోటీ ఫలితాలు ఎప్పుడువస్తాయి." అని సంపాదకుడిని అడిగాడు.

"ఫలితాలు వచ్చాయి బాబూ! వచ్చే సంచికలో వేస్తున్నాము. చూడు" అని చెప్పాడు సంపాదకుడు.

"ఎవరెవరి కథలకు బహుమతులు వచ్చాయండీ?" అని ఫణిబాబు ఆత్రుతగా అడిగాడు.

"అది ఇప్పుడప్పుడే చెప్పకూడదు గాని... పత్రికచూడు. తెలుస్తుంది గదా!"అన్నాడాయన.

"పత్రిక ఎప్పుడువస్తుందా?! అని ఎదురుచూడటం సాగించాడు ఫణిబాబు.

ఆ సమయం రానే వచ్చింది.

పత్రికవచ్చింది.

దానిని తీసుకొని 'గబగబా' కథలపోటీ ఫలితాల కోసం తిప్పిచూశాడు. దానిలోని ఫలితాలు చూచి నీరుకారిపోయాడు. తన కథకు ఏమీ రాలేదు. మూడు బహుమతులూ ఎవరెవరికో వచ్చాయి.

అతడికి దుఃఖం ముంచుకు వచ్చింది.

తరువాత కోపం వచ్చింది.

'కథ ఎంతో బాగా రాశాను కదా? నాకెందుకు బహుమానం ఇవ్వలేదు?' అని ఆలోచించాడు.'

"ఛీ! పాడుపత్రిక" అని అనుకున్నాడు.

"బహుమతులు వచ్చిన వాళ్ళంతా సంపాదకులకు అయినవాళ్ళా?" అని లోపల ఉడుక్కున్నాడు.

"అంతేనేమో?" అనిసమాధానపడ్డాడు. మరునాడు పత్రిక ఆఫీసుకు వెళ్లాడు.

"ఏమండీ! నేను కథను ఎంతో బాగా రాశాను గదా? నా కథకు ఎందుకని బహుమానం ఇవ్వలేదు?" అని అడిగాడు.

సంపాదకుడు సంగతి గ్రహించాడు.

ఫణిబాబు బాధను అర్థంచేసుకున్నాడు.

అనునయంగా "చూడుబాబూ! కథలపోటీకి నీలాగే చాలామంది కథలు పంపించారు. అటువంటి వాళ్లంతా 'బహుమానం వస్తుందనిఎదురు చూస్తుంటారుకదూ? కాని బహుమానం అందరికీ ఇవ్వడం సాధ్యమా? నీవే ఇంత బాధపడుతున్నావే! మిగతా వాళ్లు ఇంకా ఎంతబాధపడాలి చెప్పు" అని అన్నాడు సంపాదకుడు.

ఫణిబాబు మాటాడలేకపోయాడు.

సంపాదకుడు పోటీకి వచ్చిన కథలన్నిటినీ చూపించాడు.

ఫణిబాబు అవన్నీ చూశాడు.

కథలు ఎన్నో ఉన్నాయి.

"తనలాంటి వాళ్లు ఇందరు ఉన్నారా?" అనుకున్నాడు.

"పాపం వాళ్ల బాధకూడా తనలాంటిదే కదా? అయినా సంపాదకులవారు అన్నట్లు అందరికీ బహుమానం ఇవ్వటం  సాధ్యం కాదుకదా?" అని తృప్తిపడ్డాడు.

తేలికపడిన మనస్సుతో సంపాదకుడికి కృతజ్ఞతలు చెప్పాడు. ఆనందంతో వెనక్కు తిరిగాడు. *

# పూలపొట్లాలు

రాము పట్నంలో చదువుకుంటున్నాడు.

దీపావళి పండుగ పదిరోజులు ఉందనగానే బడికి సెలవులు ఇచ్చారు. ఆ సెలవుల్లో రాము వాళ్ల మామయ్యగారి ఊరు వెళ్లాడు. అది పల్లెటూరు. వాళ్ల మామయ్య కొడుకు పోలయ్య. రాముా వయస్సు వాడు. వాళ్లిద్దరికీ ఎప్పటినుండో స్నేహం. రాము పట్నంనుండి వాళ్ల ఊరు వచ్చినప్పుడల్లా, పోలయ్య క్షణం విడిచి ఉండలేక పోయేవాడు.

అది పంటల సమయం కదా! ఆ ఊరిచూట్టూ వరిచేలు ఉన్నాయి. మెట్టపొల్లాల్లో కంది, జొన్న బాగా ఎదిగి ఉన్నాయి. తోటల్లో, దొడ్లలో రకరకాల కూరగాయల చెట్లు, పూల చెట్లు ఉన్నాయి. అంతా కన్నుల పండువుగా ఉన్నది.

అన్నీ బాగానే ఉన్నాయి. కాని పట్నంలోలాగా దీపావళి మందు సామానుల దుకాణాలు రాముకు ఎక్కడా కనిపించలేదు. పట్నంలో తాను ఇక్కడకు రాకముందు నుండే చాలా దుకాణాలలో మందు సామాను అమ్ముతున్నారు."ఇది పల్లెటూరుకదా? పండుగకు నాలుగు రోజుల ముందు తెస్తారేమో!" నని అనుకున్నాడు రాము.



ఉండ బట్టలేక పోలయ్యను ఆ సంగతే అడిగాడు.

"రామూ! ఊరక డబ్బులుపోసి మందుసామాను కొని తగలెయ్యటం ఎందుకు? అసలు నీవు ఎప్పుడన్నా 'పూలపొట్లాల' గురించి విన్నావా?" అడిగాడు పోలయ్య.

రామూకి ఆ పేరు కొత్తగా అనిపించింది. అందుకే 'తెలీదు' అన్నాడు.

"అయితే వాటి పస నేను చూపిస్తానులే!" పోలయ్య అన్నాడు.

ఆరోజు ఉదయం అందరూ అన్నాలు తిన్నారు.

రామూను వెంటబెట్టుకొని పోలయ్య పొలానికి బయలుదేరాడు. ఊరు దాటి డొంకకు వచ్చారు. దాని పక్కనే పిల్లకాలువ పారుతున్నది. కాలువకట్టపైన మనిషి ఎత్తున రెల్లుగడ్డి పెరిగి ఉన్నది. కట్టమీద వరుసగా తాటి చెట్లు ఉన్నాయి. కొన్ని చెట్లకు తాటికాయల గెలలు బాగా ఉన్నాయి. ఇవన్నీ చూసుకుంటూ రాము పోలయ్య వెంట చాలా దూరం వచ్చాడు.

"నీవు చూస్తూ ఉండు రామూ! నీకే తెలిసివస్తుంది." అంటూ పోలయ్య రాములోని కుతూహలాన్ని ఇంకా ఎక్కువ చేశాడు.

కొంతదూరం వెళ్లాక పోలయ్య వాళ్ల పొలం వచ్చింది. దాని పక్కన చాలా తాటిచెట్లు ఉన్నాయి. పోలయ్య ఒక చెట్టు ఎక్కాడు. దానికి కాయలు లేవు. కాని 'గిలకలు' చాలా ఉన్నాయి.

పోలయ్య గిలకలు కోసి పడవేశాడు. వాటిని కట్టకట్టాడు. ఆ దగ్గరలోనే జిల్లేడు చెట్లు ఉన్నాయి.వాటిని తవ్వి కొన్ని వేళ్ళు పోగుచేశాడు. తరువాత ఇంటికి బయలు దేరాడు. ఇంటికి వచ్చిన తరువాత వాటి రెంటినీ పోలయ్య ఎండబెట్టాడు.

మూడు రోజులకు అవి బాగా ఎండిపోయాయి. వాటిని కాల్చి బొగ్గులు చేశాడు పోలయ్య. వాటి రెంటినీ కలిపి దంచి పొడి చేశాడు. చాలా పొడి తయారయింది. దుకాణంనుండి 'సూరేకారం' తెచ్చాడు. ఆ పొడిలో కలిపాడు. కొన్ని పెద్ద గుడ్డముక్కలు తీసుకొని, ఆ పొడిని వేసి గుండ్రని పొట్లాల్లా చుట్టి గట్టిగా కట్టాడు. పైభాగాన మాత్రం వదిలిపెట్టి, మిగతా భాగం చుట్టూ పేడ పూసి ఎండబెట్టాడు.

ఇంతలో దీపావళి రానే వచ్చింది.

రామూకు కుతూహలం ఇంకా పెరిగింది.

'పూలపొట్లాల సంగతి ఎప్పుడు చూద్దామా? ఎప్పుడు చూద్దామా?' అని ఆరాటపడటం సాగించాడు.

ఆరోజు ఉదయాన్నే రామును, పోలయ్య మళ్లీ పొలం తీసుకువెళ్లాడు. చిన్నతాటి చెట్లకు ఉన్న మట్టలు నాలుగైదు నరుక్కువచ్చాడు. వాటిని కింద అలాగే ఉంచి పైభాగాన మాత్రం మూడు భాగాలుగా చీల్చాడు. ఆ చీలికలలో ఇంతకు ముందు చేసిన పొట్లాలు పెట్టి తాడులో పైభాగాన గట్టిగా కట్టి ఉంచాడు.

పట్నం నుండి రామూ వచ్చాడని వాళ్ల మామయ్య మందు సామాను కొని తెచ్చాడు. రామూకు వాటిపైన ధ్యాసేలేదు. వాడి మనస్సంతా పూలపొట్లాల మీదనే ఉన్నది.

పొద్దు కుంకేముందు ఊరిచెరువు కట్టమీద, నరకాసురుడిని కాల్చారు. పోలయ్య గడ్డితో ఇద్దరు నరకాసురుళ్లను చేశాడు. దానినిండా తాటాకు టపాకాయలు గుచ్చాడు. రాము ఒకటి, పోలయ్య ఒకటి తీసుకు వెళ్లి కాల్చి వచ్చారు.

తిరిగి రాగానే పూలపొట్లాలపైన కాలుతున్న బొగ్గులు పెట్టాడు. చాలాసేపటికి అవి రాజుకున్నాయి. ఇంతలో బాగా పొద్దుకుంకింది. చుక్కలు ఆకాశంనిండా అలుముకున్నాయి. అసలే ఆరోజు అమావాస్య. చీకటి చిక్కని కాటుకలా ఉన్నది.

దూరంనుండి టపాకాయలు, చిన్న బాంబులు పేలిన చప్పుళ్లు వినిపిస్తున్నాయి. అక్కడక్కడా, చిచ్చుబుడ్లూ, కాకరపువ్వులు, మతాబులు, చిటిచెటలా పూలు రాల్చి మాసిపోతున్నాయి

[illegible] కాల్చుతున్నాడు. [illegible]

పోలయ్య పూలపొట్లాలు తీసుకువచ్చాడు. రాముకు ఒకటి ఇచ్చాడు. వాళ్ల ఇంటికి దగ్గరలో ఉన్న మైదానంలోకి తీసుకువెళ్లాడు. పోలయ్య పొట్లాలకు కట్టిన తాడును పట్టుకొని, తన తలపైగా గుండ్రంగా తిప్పటం సాగించాడు.

చూట్టూ ఎడ తెగకుండా.. సన్నని పూలురాలుతున్నట్లు ఆ పొట్లాలలోనుండి రవ్వలు రాలసాగాయి. రాముకు వాటిని చూస్తుంటే చాలా సంతోషమయ్యింది.

పోలయ్య కాసేపు అలా తిప్పి, రామూనుగూడా తిప్పమన్నాడు. రాముకూడా పోలయ్యలాగే తిప్పటం సాగించాడు. ఇంతకుముందురాలే పూలను బయటినుండి చూశాడు. ఇప్పుడు తాను పూలలోపల ఉన్నాడు. పొట్లాలనుండి బొగ్గు పొడి బాగా కాలి, రవ్వలు... రవ్వలుగా రాలుతున్నది. కాని అవి కొన్ని అతడిమీద పడినా, కాలినట్లు అనిపించటంలేదు. అయినా పొట్లాం చుట్టూ తిరగటం వల్ల అవి అసలు మీదే పడటం లేదు.

ఇలా చాలా సేపు రాము.. పోలయ్య కలిసి తయారుచేసిన పొట్లాలన్నీ తిప్పారు. తరువాత ఇంటికి వచ్చారు. వాళ్ల మామయ్య అప్పుడయినా మందుసామాను కాల్చమన్నాడు. రాము అలసిపోయి ఉన్నాడు. పైగా అప్పటికే ఎంతో ఆనందం పొంది ఉన్నాడు. అందుకని మందుసామాను 'కాల్చలేను' అని అన్నాడు.

వాళ్ల అత్తయ్య "వాడు ఇవి ఎందుకు కాలుస్తాడండీ! వాడికి ఎన్నాళ్ళనుండో పూల పొట్లాలమీద ఆరాటంగా ఉంది. అది తీరిందిగా. ఇంకా మందు సామాను ఏం కాలుస్తాడు." అన్నది.

"అవును మామయ్యా! మా పట్నంలో ఎన్నో రూపాయలు పోసి మందుసామాను కొంటాం. అవి కాల్చినా రానంత ఉత్సాహం, ఆనందం, ఊరికనే కొంచెం శ్రమపడి తయారుచేసిన పూలపొట్లాల వలన వచ్చింది. ఎంతో సరదాగా ఉన్నది. పూలపొట్లాలే నయం" అని రామూ జవాబు ఇచ్చాడు.

"పూలపొట్లాల పసబాగా తెలుసుకున్నావు లాగుందే!" అని పోలయ్య అన్నాడు. ఆ మాటలకు అందరూ నవ్వారు. వాళ్లతోపాటు రాము కూడా శృతి కలిపాడు.

ఇంతలో పోలయ్య మెల్లిగా వెళ్లి సీమటపాకాయల పొట్లాం ఒకటి తీసుకువచ్చాడు. దానిని కాల్చి దూరంగా విసిరివేశాడు. అవి కాలుతూ చేసిన 'చిటపటలు' వాళ్ల నవ్వుల ధ్వనుల్లో కలిసిపోయాయి. *

# తృప్తి

ఆ రోజు పండుగ.

నాగేశు ఆ పండుగ కోసం ఎన్నో రోజులనుండి ఎదురుచూస్తున్నాడు. అది రానే వచ్చింది. అతడి హృదయంలో ఎన్నో రోజుల నుండి కోరుకుంటున్న మంచి రోజు వచ్చినందుకు ఆనందం పరవళ్లు తొక్కుతున్నది.

దేవుడు ఊరేగుతాడు. ఎంతో చక్కగా బాజాలు మోగుతాయి. గుడిదగ్గర రకరకాల దుకాణాలు వెలుస్తాయి. వింతలూ, వినోదాలూ జరుగుతాయి. ఊరంతా ఎంతో సందడిగా ఉంటుంది. ఇంకా ఆరోజు కొత్త బట్టలు తొడుక్కోవచ్చు.

దేవుడి గుడిదగ్గరకు వెళ్లటానికి నాగేశు తయారువుతున్నాడు. అమ్మ ఊళ్లో వాళ్ల దగ్గరనుండి అడిగి తెచ్చిన బుల్లిలాగు, బుల్లిచొక్కా! అవి మాత్రమే తనకు ఉన్నాయి. అవే తనకు కొత్త బట్టలు.

తనకు కూడా పొడుగులాగు, పొడుగు చొక్కా కావాలని అమ్మతో ఎన్నోసార్లు చెప్పాడు నాగేశు. కాని అవి ఎవ్వరూ ఇవ్వలేదంట.

కొనుక్కోవాలంటే వాళ్లు బీదవాళ్లు, అందుకని డబ్బులు ఎక్కడినుండి వస్తాయి. అందుకనే బుల్లిలాగు... బుల్లిచొక్కా... ఎవరో ఇచ్చిన పాతవి.



నిన్న వాడి అమ్మ శుభ్రంగా ఉతికి ఆరవేసినవి తొడుక్కున్నాడు.

దేవుడు ఊరేగింపుకి బయలుదేరుతాడేమో? తొందరగా వెళ్లాలి. అని ఆరాటపడుతున్నాడు నాగేశు. వాడి ఆరాటం చూచి వాడి తల్లి ఎంతో ముచ్చటపడింది. ఊళ్లోనుంచి తెచ్చిన అన్నం పెట్టి రెండు గారెలు ఇచ్చింది.

నాగేశు గుడి దగ్గరకు వచ్చాడు.

గుడి ఆవరణలో ఎంతోమంది ఉన్నారు. అందులో తనలాంటి పిల్లలే ఎక్కువ. పెద్ద వాళ్లుకూడా అక్కడక్కడా ఉన్నారు.

నాగేశు రోడ్డుమీద నిలబడి అంతా చూస్తున్నాడు. గుడి ఆవరణలోనికి వెళ్లటానికి వాడికి భయం వేసింది. గుళ్లోనుండి దేవుడిని కొంత మంది కొబ్బరికాయలు కొట్టి హారతులు ఇస్తున్నారు. అందరికంటే పిల్లలు గడబిడ అక్కడ ఎక్కువగా ఉన్నది.

పిల్లల హంగామా చూచిన నాగేశు మెల్లిగా వాళ్ల వెనుకకు వెళ్లాడు. వాళ్లంతా రంగురంగుల చొక్కాలు... పొడుగు లాగులు తొడుక్కొని ఉన్నారు. చక్కగా తలలు దువ్వుకొని తళతళలాడుతున్నారు. నాగేశు వాళ్లవంకా, వాళ్లబట్టల వంకా అదే పనిగా చూడటం సాగించాడు.

అంతలో కొందరి పిల్లల దృష్టి నాగేశు మీద పడనే పడింది. పొట్టి లాగూ, పొట్టి చొక్కా తొడుక్కొని, తల అంతా రేగి ఉన్న అతడిని చూచేటప్పటికి వాళ్లకు అసహ్యం వేసింది. అందరూ వాడి వంకకు తిరిగారు.

ఒక్కసారిగా "ఏయ్! నీవు ఇక్కడకు రాకూడదు. ఏబ్బే! ఇదేం చొక్కా... చీ!ఛీ! ఇదేం లాగు. ఫో!ఫో!" అన్నారు.

నాగేశుకు చచ్చేంత పని అయ్యింది.

మెదలకుండా నుంచున్నాడు.

మళ్లీ వాళ్లు అన్నారు.

"ఎవర్రా! నీవు, పొమ్మంటే పోవు!" అని వాళ్లల్లో ఒకడన్నాడు.

"వీడే! మాఇంట్లో పనిచేస్తుందే! దానికొడుకురా!" అని

నాగేశుకు దుఃఖం ముంచుకు వచ్చింది.

'అసలు అక్కడ ఉండగూడదు.' అని అనుకున్నాడు. దేవుడిని

చూడాలని ఎంతో హుషారుగా వచ్చాడు. అటువంటి వాడు కళ్లారా చూడకుండానే బిక్క మొఖం వేసుకొని, ఏడుస్తూ వెనుకకు తిరిగాడు. దారిన వస్తూ ఉంటే ఏడుపు ఆగిపోయింది. కాని తన ఇంటి దగ్గరకు వచ్చి అమ్మను చూడగానే దుఃఖం పెల్లుబికి వచ్చింది.

ఒక్కసారి బావురుమన్నాడు.

వాళ్ల అమ్మకు తెలుసు తన కొడుకు తిరిగి వస్తాడని.

అసలు "అక్కడకు వెళ్లవద్దు. దేవుడు ఊరేగుతూ బజారుకు వచ్చి నప్పుడు చూద్దువుగాని." అని చెప్పింది కూడా. కాని వాడి ఆరాటం చూచి వద్దనలేక పోయింది.

నాగేశు ఉలకలేదు. పలకలేదు. వాడి బాధ తీరిపోయిందాకా ఏడ్చాడు. ఆ తరువాత మెదలకుండా ఊరుకున్నాడు.

పోయి ఇంట్లోని చాపమీద పడుకున్నాడు.

వాడి మనస్సంతా ఆలోచనలతో అస్తవ్యస్తంగా ఉన్నది. అంతలో వాడి దృష్టి ఇంట్లో గోడకు వేలాడుతున్న పటంపైన పడింది. అది చిన్నపటం. బాగా మసిపట్టిపోయి ఉన్నది. దానిలో దేవుడి బొమ్మ మసకమసకగా కనిపిస్తున్నది.

వెంటనే అమ్మను. "అమ్మా! అది ఏ దేవుడి పటమే? " అని అడిగాడు.

"అదా! అది, మనలను రక్షించే భగవంతుడిది. వేంకటేశ్వరస్వామి వారిదిరా! నాయనా!" అని అమ్మ అన్నది.

"అయితే గుళ్లో దేవుడూ?

అసలు ఇందరు దేవుళ్లున్నా పేరులో మార్పేగాని, అందరూ ఒక్కటేరా!" అని వివరించింది అమ్మ.

"అయితే నేను గుళ్లో దేవుడి దగ్గరకు వెళ్లనులే! ఈ దేవుడికే దండం పెట్టుకుంటాలే!" అని అక్కడ ఉన్న పటానికి దండం పెట్టుకున్నాడు.

అప్పుడు అతని హృదయం ఎంతో తేలికయ్యింది.

"మా ఇంట్లోకూడా దేవుడు ఉన్నాడు. గుళ్లోకే వెళ్లి చూడకపోతే ఏం?" అని అనుకొని తృప్తిపడ్డాడు. *

# పెన్సిల్ పరిశోధన

క్లాసులో రాంబాబు పెన్సిల్ పోయింది.

మంచి పెన్సిల్.. మెత్తగా నల్లగా రాస్తుంది.

బజార్లోని దుకాణాలన్నీ గాలించి దానిని ఎంతో కష్టంతో కొన్నాడు.

'అంతకంటే మంచి పెన్సిల్ డ్రాయింగ్ వేసుకోవటానికి ఏదీలేదు.' అని డ్రాయింగ్ మాష్టరుగారు చెబుతూ ఉండేవారు.

'ఔటు బెల్లు' కొట్టినప్పుడు రాంబాబు వెళ్లాడు. అతడు ఎప్పుడు బయటకు వెళ్లినా, పుస్తకాలు, పెన్ను, వగైరా డెస్కులో పెట్టిపోతూ ఉండేవాడు.

ఆవాళ కూడా అదే విధంగా చేశాడు. కాని మళ్లీ వచ్చి చూసుకుంటే పెన్సిల్ లేదు. 

మాష్టారికి చెప్పాడు. ఆయన పిల్లలందరినీ పేరుపెట్టి పిలిచి అడిగాడు.

అందరూ "తీయలేదు" అని అన్నారు.

పెన్సిల్ దొరకదని రాంబాబుకు ఏడుపు వచ్చింది. మళ్లీ ఆ పెన్సిల్





కొందామన్నా దొరకలేదు.

అసలు దానిని కొని వారం రోజులు కూడా కాలేదు.

ఆరోజు దాని కోసం బజార్లన్నీ కాళ్లరిగేలా తిరిగాడు. ఎక్కడా దొరకలేదు. నిరాశతో వెళుతూ ఉంటే, చివరకు 'సారధీ' ఫ్యాన్సీ షాపు కనిపించింది.

అక్కడ ఏమన్నా దొరుకుతుందేమో? నని అడిగాడు. షాపు అతను 'లేదు' అన్నాడు.

అది ఇంగ్లండులో తయారయ్యే పెన్సిల్. విదేశీ సరుకుల దిగుమతి తగ్గించటం వల్ల పెన్సిళ్లు రావటం లేదట. రాంబాబుకు చాలా విచారం వేసింది. విసుగూ పుట్టింది.

నిరాశగా తిరిగి వెళుతూ ఉంటే ఆ షాపు ఆయన "ఉండుబాబూ! ఎక్కడన్నా ఉన్నదేమో చూస్తా?" అని పెన్సిళ్లు అన్నీ గాలించాడు.

చివరకు రాంబాబుకు కావలసిన పెన్సిల్ దొరికింది. "నీ అదృష్టం బాబూ! నీకు కావలసిన పెన్సిల్ దొరికింది!" అన్నాడు షాపు యజమాని.

రాంబాబు కళ్లు సంతోషంతో మెరిశాయి.

దాని ధరచెల్లించి...పెన్సిల్ తీసుకొని గబగబా ఇంటికి వెళ్లాడు. మరపెట్టి దానిని చక్కగా చెక్కాడు. దానితో ఒక బొమ్మ వేసి చూశాడు. చాలా బాగా రాసింది.

"ఆహా! ఎంత చక్కగా... ఎంత నల్లగా రాస్తుంది, నా పెన్సిల్" అని మురిసిపోయాడు.

బడిలో తన అంతటి గొప్ప వాడులేడనుకొని తనలో తాను ఉప్పొంగి పోయాడు. సంతోషంతో మరునాడు బడిలో డ్రాయింగ్ మాష్టారుకు చూపించాడు.

ఆయన ఒక బొమ్మ వేసి చూచి పెన్సిల్ ను మెచ్చుకున్నారు. ఆ పెన్సిల్‌ను అందరికీ చూపిస్తూ "మీరు కూడా ఇటువంటి పెన్సిల్ కొనుక్కోండి" అని చెప్పారు.

ఇకను పిల్లలంతా రాంబాబు చుట్టూ గుమికూడారు. "ఏ షాపులో కొన్నావ్?" "ఎంతకు కొన్నావ్?" అని పదే పదే అడిగారు. రాంబాబు ఆ పెన్సిల్ గొప్పతనాన్ని తలచుకొని వాళ్లకు దానిని కొన్న విధానమంతా వివరించి చెప్పాడు.

ఆ పెన్సిల్ వల్ల క్లాసులో రాంబాబుకి ఆధిక్యత లభించింది. తనలో తానే సంతోషించాడు.

అటువంటి పెన్సిల్ పోయింది.

అందుకని 'దుఃఖం' ఎవరికిరాదు.

తన క్లాసులో వాళ్ళే ఎవరన్నా తీసి ఉంటారని 'రాంబాబు'కు అనుమానం వేసింది. ఆ అనుమానం ఎక్కువగా 'రవిగాడి' మీదనే ఉన్నది.

రవి కూడా డ్రాయింగ్ వేస్తాడు. రాంబాబు పెన్సిల్ కొన్నరోజునే వేధించాడు. "ఏ షాపులో కొన్నావ్! చూపిద్దువు పద. మంచి పెన్సిల్ కొన్నావు. బొమ్మలు కూడా బాగుంటున్నాయి." అని.

అతడు ఆరోజు ఆ పెన్సిల్ కోసం బజార్లన్నీ రాంబాబును కూడా తిప్పాడు.'పెన్సిల్ తీసింది అతడే అయి ఉండవచ్చు' అని నిశ్చయించుకున్నాడు. ఇకను రాంబాబు పరిశోధన చేసి 'పెన్సిల్ దొంగ' ను పట్టుకోవాలనుకున్నాడు.

స్కూలు వదిలారు. రాంబాబు నేరుగా పెన్సిల్ కొన్న 'ఫ్యాన్సీషాపు' వద్దకు వెళ్ళాడు. "ఏం బాబూ! ఏం కావాలి?" అని షాపు యజమాని అడిగాడు.

"నాకేమి వద్దు కానీండి. మొన్న నాకు ఇచ్చిన పెన్సిల్ లాంటి పెన్సిళ్లు ఏమన్నా ఉన్నాయా?" అని అడిగాడు. రాంబాబు.

"లేవు బాబూ! అప్పుడు నీకు ఇచ్చేటప్పుడు ఎంతో వెదికి ఇచ్చానే!" అన్నాడు షాపు అతడు.

'సరే!' నని రాంబాబు ఇంటి వెళ్ళాడు.

మరునాడు మామూలుగా బడికి పోయాడు. బడికి వెళ్లిన వెంటనే రాంబాబు,రవిని పరిక్షించటం మొదలుపెట్టాడు.

అతడు బొమ్మ గీస్తున్నాడు. ఆశ్చర్యం...

వాడిచేతిలో ఉన్న పెన్సిల్ రాంబాబుదే! రాంబాబుకు దానిని చూడగానే పోయిన ప్రాణం లేచివచ్చినట్లయింది.

"వాది ఈ పెన్సిల్!" అని వాడి దగ్గరకు వెళ్లి అడగలేకపోయాడు.

మాష్టారు రాగానే ఆయనకు చెప్పాడు.

ఆయన రవిని పిలిచి "నీకు ఈ పెన్సిల్ ఎక్కడిది?" అని అడిగాడు.

అతడు కొంచెం తడబడ్డాడు.

కాని సముదాయించుకొని, "నాదేనండి. మా అన్నయ్య ఎప్పుడో కొన్నాడట. అది ఊరికనే పడి ఉంటే నాకు ఇచ్చాడు." అన్నాడు రవి.

మాష్టారు బెదిరించాడు. కాని అతడు లొంగలేదు. రాంబాబుకు దుఃఖం వచ్చింది.

"కావలిస్తే చూడండి.. రాంబాబుది పెద్ద పెన్సిల్. నాది ఎంతో చిన్నది." అన్నాడు పైగా రవి.

అందువల్ల పెన్సిల్ రాంబాబుదని ఋజువు కాలేదు. వెళ్లి ఇద్దరూ సీట్లో కూర్చున్నారు. మాష్టారు పాఠం చెబుతున్నారు. అయినా రాంబాబు సరిగ్గా పాఠం వినటంలేదు. అతని ధ్యాస అంతా పెన్సిల్ పైనే ఉన్నది. వెంటనే అతడి మనస్సులో ఒక ఆలోచన తళుక్కుమన్నది. దానితో కొంచెం ఊరట కలిగింది. ఆనందం వచ్చింది.

బడి వదిలారు. రాంబాబు ఆడటానికి పోకుండా తిన్నగా కాలేజీ వైపు నడిచాడు.

అక్కడ రవివాళ్ల అన్నయ్య ఫుట్ బాల్ ఆడుతున్నాడు. రాంబాబు నేరుగా అతడి దగ్గరకు వెళ్లాడు. వీలుచూచుకొని మెల్లిగా. "మీరు నిన్న రవికి ఏమన్నా పెన్సిల్ ఇచ్చారా?" అని అడిగాడు.

అతడు "లేదు. నేనసలు ఏ పెన్సిలూ వాడికి ఇవ్వలేదు" అన్నాడు.

దానితో రాంబాబుకు సగం బలం వచ్చింది. సంతోషంతో మళ్లీ రవి వస్తాడేమోనని, త్వరత్వరగా రవివాళ్ల ఇంటివైపు నడిచాడు.

రవి వాళ్ల ఇంటి ముందర ఎవరూ లేరు. మెల్లగా పెంటపోగు దగ్గరకు వెళ్లి వెతికాడు.

ఆశ్చర్యం దానిలో పెన్సిల్ చెక్కిన పొట్టుపైనే ఉన్నది. రాంబాబు కళ్లు మెరిశాయి. ఆ పొట్టును గబగబా ఏరి, పొట్లాం కట్టుకున్నాడు. ఆ పొట్లాన్ని పంచీలో పెట్టుకొని సంతోషంగా ఇంటికి వెళ్లాడు.

"ఎప్పుడు బడికి వెళ్దామా? ఎప్పుడు పెన్సిల్ తీసుకుందామా?" అని అతడి మనస్సు ఉర్రూతలూగుతున్నది.

చివరికి తెల్లవారింది. సంతోషంగా బడికి వెళ్లాడు.

మాష్టారు రాగానే "మాష్టారూ! రవి దగ్గరి పెన్సిల్ నాదే! నాకు ఇప్పించండి" అని అడిగాడు.

సాక్ష్యాధారంగా నిన్న ఏరుకు వచ్చిన పెన్సిల్ పొట్టు చూపించి వివరంగా చెప్పాడు రాంబాబు.

ఆయన రవిని పిలిచి "పెన్సిల్ రాంబాబుకు ఇవ్వు" అని చెప్పాడు.

"నేను ఇవ్వనండీ!" అని వాడు మాష్టారినే దబాయించాడు.

"ఏం రా! పెన్సిల్ దొంగిలించి, ఇంటికి తీసుకువెళ్లి గుర్తుపట్టకుండా పొడుగు తగ్గించి, తీసుకువచ్చావా? ఈ పొట్టు చూడు....దానిది కదా?" అని మాష్టారు గద్దించారు.

"కాదండీ! మాష్టారు" రాంబాబు పెన్సిల్ కాజేయాలని ఈపొట్టు ఎక్కడినుండో తీసుకువచ్చాడండి. కావలిస్తే అన్నయ్యను అడగండి." అని రవి మళ్లీ అన్నాడు.

ఆ మాటకు రాంబాబు వెంటనే: "అయితే పద. మీ అన్నయ్య దగ్గరకు." అన్నాడు గట్టిగా.

దానితో రవి ఆట కట్టింది.

బిక్క మొఖం వేశాడు.

"ఏం రవి! మీ అన్నయ్య దగ్గరకు రావా?" అని రాంబాబు మళ్లీ అన్నాడు.

రవి నీరుకారిపోయాడు. తప్పు ఒప్పుకున్నాడు. పెన్సిల్ రాంబాబుకు ఇచ్చాడు. రాంబాబు 'ప్రాణం' లేచి వచ్చింది. దీర్ఘంగా నిట్టూర్చాడు.

మాష్టారుగారు రవిని దండించాడు.

ఇంకను రవి "ఎప్పుడూ ఇటువంటి పనులు చేయను" అని అందరి ముందు లెంపలు వేసుకున్నాడు.

మాష్టారు పిల్లలందరికీ రాంబాబు చేసిన పరిశోధన గురించి వివరించి చెప్పారు.

"ప్రతి విషయంలో మీ బుద్ధిని ఇట్లా ఉపయోగించుకోవాలి" అనే సలహా కూడా ఇచ్చారు.

*

# మంచి ధనం

ఆరోజు ఆదివారం. సాయంకాలం అయిదు గంటలు దాటింది. ప్రసాద్ షికారుకు పోవటానికి తయారు అవుతున్నాడు. ఆదివారం వస్తే చాలు అతడు తప్పకుండా షికారుకు బయలుదేరుతాడు.

ప్రసాద్ ఏడవ తరగతి చదువుతున్నాడు. వాళ్ల ఊరికీ, స్కూలుకూ చాలాదూరం. అందుకని స్కూలు దగ్గర్లోనే ఉన్న హాస్టల్‌లో ఉంటున్నాడు.

అతడి స్కూలు ఉన్న ఊరు అటు పట్నంకాదు.. ఇటు పల్లెటూరూ కాదు. రైలు స్టేషను ఉన్నది. అది వచ్చే పోయే బస్సులకు కేంద్రం.

హాస్టలుకు ఒక ఫర్లాంగు దూరంలో పాత తుంగభద్ర పారుతున్నది. దానిని దాటిపోతే రైలు స్టేషను వస్తుంది. ఆ రైలు స్టేషను దాటి, రైలు కట్టనే వెళితే... చెరకు తోటలు... నిమ్మ, తమలపాకుల తోటలు ఉంటాయి. అక్కడక్కడా పూలతోటలు, కూరగాయలతోటలూ ఉన్నాయి. సాయం సమయంలో వాటిని చూడటమంటే ప్రసాద్‌కు ఎంతో సరదా.

ఆ రోజు మామూలుగా బయలుదేరాడు.

అతడు తుంగభద్ర దాటాడు. రైలుస్టేషను ప్రాంతాలకు వచ్చాడు. "బాపట్ల వైపు నుండి ప్యాసెంజరు రైలు అప్పుడే వచ్చింది." అది అసలు ఎప్పుడో రావలసింది. కాని ఆవాళ చాలా ఆలస్యంగా వచ్చింది.



బండిలోనుండి ప్రయాణీకులు దిగినదాకా ఉండి బండి కదలిపోయింది. ప్రసాద్ బండిలో నుండి దిగిన వాళ్లనందరినీ చూస్తున్నాడు. రకరకాల ప్రయాణీకులు ఎవరి దారినే వారు వెళుతున్నారు.

రైలు దిగిన వాళ్లల్లో ఒక కుటుంబం ప్రసాద్‌ను ఆకర్షించింది. వాళ్లు భార్యాభర్తలు. వాళ్లకు ఏడాది, మూడేళ్ళు, అయిదారేళ్ళ పిల్లలూ ఉన్నారు. సామాను కూడా చాలా ఉన్నది.

ఆయన రిక్షాకోసమో, కూలీల కోసమో చూశాడు. ఎవరూ దొరక లేదు. పిల్లలు ముద్దు వస్తున్నారు. అందుకని ప్రసాద్ వాళ్లనే చూస్తూ ఉండిపోయాడు.

ఆయన చేసేదిలేక సామాను చేత పట్టుకున్నాడు. భార్య చంటి పిల్లవాడిని ఎత్తుకున్నది. ఇంకొక పిల్ల ఎత్తుకోమని మారాము సాగించింది. ఆయనకేమి పాలుపోలేదు. ఎట్లా? సామాను ఒక చేత్తో పట్టుకోవాలి. రెండవ చేత్తో పిల్లను ఎత్తుకోవాలి.

నానా యాతనగా ఉంది ఏంచేయాలి? అట్లాగే పిల్లను ఎత్తుకొన్నాడు. ఒక చేత్తో సామాను పట్టుకొని బయలుదేరాడు.

ప్రసాద్ వాళ్ల బాధ అంతా చూస్తూనే ఉన్నాడు. పాపం! ఎంత దూరం వెళ్లాలో అని అనుకున్నాడు.

ఆయనకు బరువుతో అడుగు ముందుకు పడటంలేదు. ఎలాగో మెల్లిగా నడుస్తున్నాడు. భార్య అనుసరించింది.

"నేను ఊరికనే ఉన్నాను కదా? వాళ్లకు సహాయం చేస్తే!" అని ప్రసాద్‌కు మనస్సు కొట్టుకులాడింది.

"తీరా అడిగితే వాళ్లు ఏమనుకుంటారో?" మళ్లీ అనుమానం.

"సార్! ఆ సామాను నా తల మీద పెట్టండి! నేను మోసుకువస్తాను." అని ఆయనతో అనునయంగా అన్నాడు.

ఆయన ప్రసాద్‌ను చూశాడు. 'ఎవరో కూలివాడు కాబోలు!' అని అనుకున్నాడు. "ఇటు వంటి వాళ్లను నమ్మకూడదు. మోస్తామని చెప్పి సామాన్లతో పరారు అయితే!" అనుమాన పడ్డాడు.

తప్పేదిలేదు. చీకటి పడుతున్నది. ఇల్లు చాలా దూరం ఉన్నది. ఆయనకు ఏమిచేయాలో తోచటం లేదు.

మళ్లీ ప్రసాద్ అడిగాడు. "ఏంసార్! ఆలోచిస్తున్నారు. నాపైన అనుమానమా? నేను మీరు అనుకునేటటువంటి వాడిని కానండీ!" అని తన నిజాయితీని వ్యక్తపరిచాడు.

ఆయన ప్రసాద్‌ను ఇంకోసారి పరకాయించి చూశాడు. గత్యంతరం లేక సామాను అతడినెత్తిమీద పెట్టాడు.

కూలిని గురించి నిర్ధారణ చేసుకుందామనుకున్నాడు. "ఏమి ఇవ్వ మంటావురా అబ్బాయ్!" అని అడిగాడు.

"అదంతా ఎందుకు లెండి. మీ ఇంటికి వెళ్లిన తరువాత మాట్లా డుకుందాం! కూలిది ఏమున్నది." ప్రసాద్ మాటలు విని ఆయన ఆశ్చర్యపడ్డాడు.

"వీడు సామాన్లతో ఉడాయించడుగదా!" అని మళ్లీ అనుకున్నాడు.

పెట్టె... సంచీ ప్రసాద్‌కు బరువుగానే తోచాయి. తలపైన గుడ్డ కూడా లేదు. మాడు మంటపుడుతున్నది.

ఆయన భార్య ప్రసాద్ బాధను గుర్తించినట్లుగా ఉంది. "అబ్బాయ్! మాడు మీద ఏమీలేదుగా. ఇదిగో ఈ కండువా కట్టుకో! లేకపోతే మాడు మంటపుడుతుంది" అనునయంగా అన్నది.

ఆయన పాపను దించాడు. కండువా చుట్టి ప్రసాద్ నెత్తిమీద పెట్టాడు. సామాను నెత్తిమీద పెట్టుకోవటానికి సహాయపడ్డాడు.

ప్రసాద్‌కు ఇప్పుడు కొంచెం సులువుగా ఉన్నది.అయినా బరువు ఎక్కువే! అంత బరువు ఎప్పుడూ మోయలేదు. దారిని నడుస్తూ ఉంటే కాళ్లు తడబడుతూ ఉన్నాయి. పాప మాత్రం చంకలో కూర్చొని బిల్లి బుల్లి మాటలు ఏవో చెబుతున్నది. ఆ పాప మొఖం చూస్తూ, బుల్లి బుల్లి మాటలు వింటూ ఉంటే ప్రసాద్‌కు బరువు సంగతి మరుపుకి వస్తున్నది.

వాళ్లు అలా రోడ్డు వెంట చాలా దూరం నడిచారు. ప్రసాద్ వాళ్ల స్కూలు, హాస్టల్ కూడా దాటారు. పాత ఊరు వచ్చింది. అక్కడ ఒక సందులో ఆయన ఇల్లు వచ్చింది. ఇంటికి రాగానే అరుగు మీద సామాను దించి, అలాగే కూలబడిపోయాడు. ప్రసాద్. గుండెల్లో దడ, కాళ్లో వణుకు. మాడు మంట పుట్టాయి అతడికి.

ఆయన ఇంటికి ఉన్నతాళం తీసి, సామాను ఇంట్లోకి చేర్చుకున్నాడు.

పాప ఇంట్లో సంతోషంగా కేరింతలు కొట్ట సాగించింది.

"సార్! నేను వెళ్లివస్తాను." అన్నాడు ప్రసాద్.

ఆయన "ఒరే! అబ్బీ! నీకూలి సంగతి చెప్పావుకాదే? పాపం, చాలా బరువు ఎంతో దూరం మోశావు. ఇదిగో ఉంచుకో!" అని రుపాయితీసి ఇవ్వబోయాడు.

ప్రసాద్ అది తీసుకోలేదు. ఇంకా ఎక్కువ కావాలేమోనని ఆయన అనుకొన్నాడు. ఇంకొక్క రూపాయి తీసి మళ్లీ ఇవ్వబోయాడు.

ప్రసాద్ అవీ తీసుకోలేదు.

"అయ్యగారు! క్షమించండి. నేను కూలివాడిని కాదండీ, ఎప్పుడూ ఇటువంటి పనులు చేయలేదు. మీరు పాపతోనూ, సామానుతోనూ తంటాలుపడుతుంటిరి. అందుకని మీకు సాయంచేయాలని అనిపించింది. అంతేకాని డబ్బులకోసం కాదండి" వినయంగా అన్నాడు.

ఆ మాటలు విని ఆయన మొదట ఆశ్చర్య.పోయాడు. తరువాత సంతోషపడ్డాడు. ఆయన భార్య "ఓరీ నీ అసాధ్యం కూల. భలే పిల్లవాడివే. ఇంతసేపూ నీవు మాకోసం కష్టపడ్డావా?" అంటూ విస్తుపోయింది. ఆ రెండు రూపాయలు తీసుకోమని తొందరచేసింది.

"అవునండీ అమ్మగారూ పాపలను, మిమ్ములను చూస్తుంటే నాకు చాలా ముచ్చట వేసిందండీ! అదీగాక నేను ఊరికనే ఉన్నాను గదా. మీకు కష్టంలో సహాయంచేస్తే ఏమి అనిపించింది. అంతే కాని, నేను కూలివాడినికాను. హైస్కూల్లో చదువుకుంటున్నానండీ!" అన్నాడు.

ఆమాటలు విన్న ఆ భార్యా భర్తల కళ్లలో ఆనంద భాష్పాలు కదలాడాయి. ఆయన డబ్బులు తీసుకోమని మళ్లీ తొందర చేశాడు. కాని ప్రసాద్ 'తీసుకో'నని పట్టుపట్టటం చూసి ఊరుకున్నాడు.

ప్రసాద్ ప్రవర్తన వారికి చాలా నచ్చింది.

తరువాత ప్రసాద్ గురించి వివరాలు ఎన్నో తెలుసుకున్నారు.

"అప్పుడప్పుడూ మా ఇంటికి వస్తూ ఉండు" అని చెప్పారు.

అప్పటి వరకూ ఇంటిలో గంతులు వేస్తూ ఉన్నపాప అమ్మా నాన్నల దగ్గరకు వచ్చింది. ప్రసాద్ ముద్దుగా చేతులు సాచాడు. పాప తమ సామాన్లు మోపిన ప్రసాద్ అంటే భయపడలేదు. అతడి దగ్గరకు వచ్చింది.

ప్రసాద్ పాపను ఎత్తుకొని ముద్దులాడాడు.

హాస్టల్లో భోజనం పెట్టే టైము అవుతున్నది. పాపను దించి, వాళ్లతో చెప్పి హాస్టల్ వైపు బయలుదేరాడు.

"నేను మొదట ఇతడు దొంగ అనుకున్నాను. మరిచూడు. ఎంత వింతగా మాట్లాడాడో! పిల్లలందరూ ఇటువంటి ప్రవర్తననే నేర్చుకుంటే మంచిదికాదూ? వారి జీవిత పథంలో ముందు ముందు ఎందరికో సహాయపడగలరు." అన్నాడు ఆయన. *

# తల్లిమనసు

రంగడి అసలు పేరు రంగారావు. అతడి తల్లిముద్దుగా పెట్టుకున్నాదా పేరు. కాని అందరూ 'రంగడ'నే పిలుస్తారు. అతడు ఇప్పుడు నాలుగవ క్లాసు చదువుతున్నాడు.

పాపం తండ్రిలేదు. తండ్రి చనిపోయిన దగ్గరనుండీ తల్లి వాడిని ఎంతగానో గారాబంగా పెంచుతున్నది. ఆమె పేరు సీతమ్మ. ఆమె చిన్నప్పటినుండీ కాయు కష్టం చేయటంలో దిట్ట. అందుకని కొడుకునన్నా వృద్ధిలోకి తీసుకురావాలని బడిలోకి పంపి చదివిస్తున్నది.

రంగడిని చెడ్డవాళ్ల సహవాసం చేయనీయకుండా ఉంచేది. వీలుదొరికినప్పుడు తనకు వచ్చిన మంచినీతికథలు చెబుతూ ఉండేది. రోజులు గడవటం కోసం తాను ధనవంతుల ఇళ్లలో పనులు చేస్తున్నది.

ఒకనాడు సీతమ్మకు హఠాత్తుగా జ్వరం వచ్చింది. మంచంలోనుండి లేవలేని స్థితిలో ఉన్నది. ఆ ఊరిలోఉన్న 'నాటువైద్యుడు' అయిదు



రూపాయలు ఇస్తే మందు ఇస్తానన్నాడు. ఆమె దగ్గర అంత డబ్బులేదు. ఆమె దుస్థితిని చూచిన రంగడికి చాలా జాలివేసింది.

ఆదరా, బాదరా ఇంట్లోని డబ్బాలు అన్నీ వెతికాడు. అర్ధరూపాయి చిల్లరకంటే ఎక్కువ దొరకలేదు. బడిలో మాష్టారిని అడిగి మూడు రోజులు సెలవు తీసుకున్నాడు. తల్లికి సపర్యలు చేస్తూ ఇంటి వద్దనే ఉండిపోయాడు.

రెండవ రోజుకు సీతమ్మకు జ్వరం ఎక్కువ అయ్యింది. వైద్యుడు చూచి ప్రక్క ఊరికి వెళ్లి మందు తీసుకురావాలన్నాడు. మందుకు కనీసం నాలుగు రూపాయలు అవుతుందట. ఆ మందు ఇస్తే వ్యాధి తగ్గుతుందట. చేతిలో డబ్బులు లేవు. అమ్మస్థితి అలా ఉంది. తనను పెంచి పెద్దజేస్తున్న అమ్మను ఆ సమయంలో ఆదుకోవాలనుకున్నాడు.

అమ్మ స్థితికి వారికి వివరించి చెప్పాడు. మందుల కోసం డబ్బులు కావాలని అడిగాడు. వాళ్లు డబ్బులు ఇవ్వలేదు. పైగా "గాదులనిండా దుమ్ము పట్టి ఉన్నది. అదిరాకపోతే నీవు ఊడవలేవా? బయటపని మేము చేసుకున్నాము. ఈ పని అన్నా నీవు చెయ్యి" అని వాడికి పని పురమాయించారు.

వాడి కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి.

ఇంటిదగ్గర అమ్మ స్థితి ఎలా ఉందో? వాడి మనస్సు పరి పరి విధాల పోతున్నది. వైద్యుడుచెప్పిన మాటలు చేవుల్లో 'హోరు' మంటున్నాయి.

'ఇక్కడ చెప్పిన పనిచేయకపోతే ఇకనుండి అమ్మను పనిలోకి రానీయరేమో? అమ్మకు మళ్లీ పని దొరకదేమో? ' వాడికి భయం వేసింది.

దానితో వాడు వాళ్లు చెప్పిన పని చేయటం మొదలు పెట్టాడు.

'అక్కడ తన అమ్మ ఎట్లా ఉన్నదో? ఆమె గతి ఏమవుతుందో?' అనే భయంతో పనులన్నీ త్వరత్వరగా చేస్తున్నాడు. గడబిడగా గదులన్నీ దుమ్ముదులుపుతూ ఊడుస్తున్నాడు. పెట్టె బేడా అన్నీ సర్దుతూ, ఊడుస్తూ ఉంటే ఒక పెట్టె చాటున 'పర్సు' కనిపించింది. వాడి హృదయం ఆనందంలో ఉర్రూతలు ఊగింది.

అంతలో వాడికి తన అమ్మ చెప్పిన కథలోని "ఎట్టి పరిస్థితుల్లో నయినా దొంగతనం చేయరాదు" అనేమాట జ్ఞాపకం వచ్చింది.

"ఛీ! దొంగతనం చేయాలా? ఒకవేళ పట్టుబడితే! జైల్లో వేస్తారుకదా? అమ్మో పోలీసులు భలే కొడతారు. ఇక జన్మ అంతా అప్రదిష్టలపాలై పోదూ! ఇప్పుడు ఇది తీసుకువెళ్లి ఇంటివాళ్లకు ఇస్తే వాళ్లు తనను ఎంతో మంచివాడు అంటారు కదా?" వాడి మనస్సు మంచి చెడుల మధ్య ఉయ్యాలలు ఊగింది.

అంతలోనే జబ్బుతో ఉన్న అమ్మ దీనమైన మొఖం కళ్లల్లో మెదిలింది. ఆమె ఆరోగ్యం కోసం ఏమయినా చేయాలనుకున్నాడు. కాని అమ్మ ఒకరోజు "మీనాన్నలాగా మోటు పనులు చేయకుండా, పెద్ద చదువు చదివి మంచివాడివి అనిపించుకోవాలి." అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి.

మళ్ళీ ఒక పక్క వైద్యుడు "ఈమందు తీసుకురాకపోతే మీ అమ్మకు జ్వరం నయంకాదు" అన్న మాటలు వాడి మనస్సును బాధపెడుతున్నాయి.

చివరికి ఎలాగో మనస్సును దిటవుపరచుకున్నాడు. ఎవరూ చూడకుండా ఆ 'పర్సు'ను జేబులో కుక్కుకున్నాడు. ఇంకా అక్కడ ఉంటే తాను చేసిన పని బయటబడుతుందనుకొని ఆదరాబాదరా పనిచేసి ఎవరికీ చెప్పకుండా ఇంటి దారి పట్టాడు.

కొంత దూరం వెళ్లినతరువాత ఆ ఇంటి యజమానురాలు "ఓరే

రంగా, ఇలారా?" అనిపిలిచింది.

ఆ పిలుపు వినగానే వాడి గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి.

"తాను చేసిన పని వాళ్లకు తెలిసిపోయింది కాబోలు. తనను అందరూ దొంగ అంటారేమో?" అని అనుకుంటూ, మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ ఆమె దగ్గరకు వచ్చాడు.

రంగడి భయం కనిపెట్టిన ఇంటావిడ "ఏరా! భయపడుతున్నావా? మీ అమ్మకు జ్వరం అని చెప్పావు కదా? ఎట్లా ఉంది. ఇదిగో ఈ చీటి తీసుకెళ్లి, దీనిలోని మందుకొని, వేడినీళ్లతో త్రాగించు" అని ఒక మందు చీటి, రెండురూపాయలూ వాడి చేతుల్లో పెట్టింది.

రంగడు అవితీసుకొని "బ్రతికానురా దేవుడా!" అని అనుకొని మెల్లగా ఇంటిదారి పట్టాడు.

"ఒరే రంగా! ఈ మందు వేసి, మీ అమ్మకు ఎట్లా ఉందో మళ్లీ వచ్చినాకు చెప్పు. ఇంకా డబ్బులు కావాలంటే ఇస్తాను." అని ఆ ఇంటి ఆవిడ మరోమారు హెచ్చరించింది.

చాలా దూరం వచ్చిన తరువాత తన జేబులోని 'పర్సు' చాటుగా తీసి చూశాడు. దానిలో అయిదురూపాయలు ఉన్నాయి. ఆ పర్సు ఎప్పటిదో పాతది. వాటిని జేబులో పెట్టుకున్నాడు. బజారుకు వెళ్లి మందులుకొన్నాడు. ఇంకా డబ్బులు మిగిలాయి. వాటినిపెట్టి బత్తాయిలు రెండుకొన్నాడు. ఆతృతగా అమ్మదగ్గరకు బయలుదేరాడు.

అన్నీ పోగా ఇంకా నాలుగు రూపాయలు మిగిలాయి. దేనికన్నా అవసరం వస్తుందని, వాటిని జేబులో భద్రంగా దాచాడు.

ఇంటికి వచ్చిన తరువాత వాటిని చూచిన సీతమ్మ అనుమానం

పడింది. "వీడు ఏదో పాడుపని చేశాడు. లేకపోతే ఇవన్నీ ఎట్లా వస్తాయి?" అని అనుకున్నది.

రంగడు సంతోషంగా తాను తెచ్చినవి అన్నీ అమ్మ ముందు పెట్టాడు.

ఆమె మెల్లగా "ఇవి ఎక్కడివి నాయనా? నాకోసమని తెచ్చావా?" అని అడిగింది. వాడు సంతోషంతో జరిగినదంతా చెప్పాడు.

"ఆమె మనస్సులో ఒక విధమైన 'భీతి' ప్రవేశించింది. తాను తన కొడుకును మంచి దారిలో నడిపించాలనుకున్నది. కాని, తనకోసం ఎంతపని చేశాడు.

"అయినా వీడిని దొంగతనం ఎవడు చేయమన్నాడు. నా జబ్బు ఎప్పటికయినా నయం అవుతుందిగదా?" అనుకున్నది.

ఆమె కోపం ముంచుకువచ్చింది. "ఛీ! వెధవా! ఇటువంటి దొంగ పనులు నిన్ను ఎవరు చేయమన్నారు. నాకోసమని దొంగతనం చేశావా? వాళ్లకు తెలిస్తే మన పని ఉంటుందా?" అంటూ వాడి చెంపపైనా 'చెళ్లు' మని కొట్టింది. వాడికళ్లల్లో నిలిచాయి.

ఆమె మనస్సు అటువంటింది.

తనకొడుకును సరైన దారిలో పెంచాలని అనుకున్నది. వాడి భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెట్టుకున్నది. అటువంటివాడు ఇలాంటి పాడుపని చేశాడు.

ఆమె హృదయం మళ్లీ అతడిని కొట్టినందుకు బాధపడింది. మెల్లగా రంగడిని దగ్గరకు పిలిచింది.

వాడు "అమ్మా! ఇటువంటి పనులు ఇక ఎప్పుడూ చేయనమ్మా

బుద్ధికలిగి ఉంటానమ్మా!" ప్రాధేయపడుతూ అన్నాడు.

"నాయనా! ఇలా! దొంగతనంగా పరులసొమ్ము తేవచ్చునా? నీకెందుకు. నా జబ్బు నయమవుతుందిగా. దానికోసమని దొంగతనం చేయవచ్చునా! తప్పుకదూ" అతడి తలను వణికే చేతులతో నిమురుతూ, అనునయంగా ఓదార్చింది.

"కాదమ్మా, నీవు పని చేసే ఆమె దగ్గరకు వెళ్ళి డబ్బులు అడిగాను. కాని ఆమె 'గదులనిండా దుమ్ము ఉన్నది. ఊడ్చిపో!' అన్నది. అప్పుడూ ఊడుస్తూ ఉంటే పెట్టెలచాటున ఈ పర్సు దొరికింది. దానిలో అయిదు రూపాయలు ఉన్నాయి. నీకోసమని తీసుకున్నాను. మళ్ళీ వస్తూ ఉంటే ఆమె రెండు రూపాయలు ఇచ్చింది. మెల్లగా జరిగిందంతా చెప్పాడు.

ఆ మాటలు వినగానే ఆమె మనస్సును తేలికపడింది. ఆనందంతో ఉర్రూతలూగింది. మంచంమీదినుండి మెల్లిగా లేచి, వాడిని ఒక్కసారి ముద్దుపెట్టుకుంది.

"నాయనా పో! మిగిలిన డబ్బులూ, ఈ కాయలూ ఆమెకు ఇచ్చి 'పొరపాటు చేశాను. క్షమించండి' అని జరిగినదంతా చెప్పు " అని చెప్పింది. ఆమె ఆరాటమంతా తన కొడుకును మంచి దారిలో పెట్టాలనే!

అమ్మ మాట ప్రకారం రంగడు అవి తీసికొని, అమ్మ పని చేసే వాళ్ల ఇంటికి వెళ్లాడు. జరిగిందంతా ఇంటి యజమానురాలికి చెప్పాడు.

"అమ్మగారూ! తెలియక చేశాను. ఈసారికి క్షమించండి." ప్రాధేయపడ్డాడు.

సంగతి అంతా విన్న ఆమె సంతోషించింది.

"ఎంతమంచి పిల్లవాడు. అంతకంటే వాళ్లమ్మ ఇంకెంత మంచిది."

అనుకున్నది.

"ఒరే రంగా! ఆ పర్సు ఎప్పటిదో పాతది. అది ఉన్నదని కూడా మాకు తెలియదు. నువ్వు దొంగవు కాదులే! మీ అమ్మకోసమే ఈ పనిచేశావు. పో! పోయి మీ అమ్మకు పండ్లు ఇచ్చి మిగిలినవాటిని మందులకు వాడు." అని అన్నది. వాళ్ల స్థితికి జాలి కనపరచింది.

ఆమాటలు విన్న రంగడు ఆనందంతో ఉక్కిబిక్కిరై పోయాడు. అమ్మతో ఆవార్త చెప్పటానికి ఇంటివైపు ఒక్క పరుగుతీశాడు. *

# రామన్న కథ

## 1

తెల్లవారింది.

రామన్న పక్కమీద ఉండే కళ్లు తెరిచాడు. ఇంట్లో కమ్ముకున్న పొగ ఒక్కసారిగా అతడి కంట్లోకూడా ప్రవేశించింది. అమ్మ ఎప్పుడో లేచి వంటపని ప్రారంభించిందన్నమాట.

పొగబాధనుండి తేరుకొని ఒక్కసారి తన చుట్టూ చూశాడు రామన్న. అమ్మ చంకలోని చంటివాడు కూడా పొగతో ఉక్కిరి బిక్కిరవుతున్నాడు.

తమ్ముడు ప్రకాష్ ఎడమచెయ్యి, ఎడమకాలు రామన్నమీద వేసి గాఢ నిద్రపోతున్నాడు. పక్కనే పండుకున్న చెల్లెళ్లు ఎల్లమ్మ, చంద్రమ్మలు ఇంకా నిద్రనుండి మేలుకోలేదు. పెద్ద చెల్లెలు మారెమ్మ బయట అంట్లుతోముతున్నది.

రామన్న ప్రకాష్ పట్టునుండి విడిపించుకున్నాడు. పక్కమీదనుండి వెంటనే లేచాడు. పుస్తకాల సంచీ తీసుకొని బయటకు నడిచాడు. రాత్రిళ్లు అతడు వీధిలైటు కింద కూర్చొని చదువుకుంటూ ఉంటాడు. రాత్రి



కరెంటు పోయింది. అందువల్ల "హోం వర్క్" పూర్తి చేయలేకపోయాడు. అది పూర్తి చేద్దామని పొద్దున్నే పుస్తకాలు పట్టుకున్నాడు.

వాళ్ల ఇంటిముందు చిన్న అరుగులాంటిది ఉన్నది. దానిమీద కూర్చొని పుస్తకాలు బయటికి తీశాడు. ఇంతలో ఇంటిముందు పారుతున్న మురికి కాలువలోనుండి చెడువాసన ఒక్కసారి లేచింది. ఆ వాసన భరించలేక ఒక్కసారి ముక్కు మూసుకున్నాడు రామన్న.

అదొక మురికివాడ. నగరానికి పక్కగా వెలసిన పారిశ్రామిక కేంద్రాల మధ్యన ఆ వాడ. ఆ ఊరిలోని మురికినీటినంతా మోసుకుపోతుందా కాలువ. దానిలోని నీరు ఎన్నో దుర్గంధపూరితమైన వస్తువులతో నిండి ఉన్నది. మరి అటువంటి పాడువాసన వేయదూ? ఆ వాసన ఆ వాడంతా నిండి పోయింది.

పాడువాసనకు తోడు... పగలల్లా ఫ్యాక్టరీలు విడిచిన పొగ ఆ వాడ మీదే కమ్ముకొని ఉంటుంది. దానితో వాతావరణ కాలుష్యం ఏర్పడుతున్నది. ఉన్న కొద్దీ గాలిలోని ప్రాణవాయువు శాతం తగ్గిపోతున్నది.

చుట్టూ ఉన్న పరిశ్రమలలో వేలాది జనం పనిచేస్తున్నారు. అందరూ పనులకోసం పల్లెటూర్ల నుండి వచ్చినవారే. వారికి వసతిని ఇస్తున్నవి మురికివాడలు. ఆ వాడ ఎన్నో క్రిక్కిరిసిన ఇళ్లతో నిండి వున్నది.

దుర్గంధపూరితమైన గాలిని పీల్చుకుంటూ చదవటం రామన్నకు రోజూ మామూలే. కొంతసేపటికి తెప్పరిల్లి హోం వర్కుపైన దృష్టి మళ్లించాడు.

కాస్సేపు గడిచిపోయింది. ఇంట్లోనుండి వాడి అమ్మ "రామన్నా! రామన్నా!" అని పిలిచింది. చంటివాడు గోలగా ఏడుస్తున్నాడు.

రామన్న చదువుకు ఆటంకం ఏర్పడింది. ఇంట్లోకి వెళ్లి అమ్మ అందించిన చంటివాడిని చంకన ఎత్తుకువచ్చి సముదాయించసాగాడు.

హోం వర్కు ఇంకా చాలాఉంది. మధ్యలో ఇదొక ఆటంకం. తొమ్మిది గంటలకల్లా స్కూలుకు బయలుదేరాలి.

ఏడుస్తున్న చంటివాడు ఎంతకీ ఏడుపుమానలేదు. "ఛూ! వెధవా నీ వొకడివి...." అంటూ విసుక్కొని వాడిని కింద దించాడు. మళ్లీ హోం వర్కులో తలదూర్చాడు. చంటివాడి గొంతు పెచ్చరిల్లి పోయింది. చేసేదేమీలేక పిల్లవాడిని మళ్లీ ఎత్తుకొని సముదాయించసాగాడు. కొంతసేపటికి వాడి ఏడుపు మానిపించగలిగాడు. మళ్లీ హోం వర్కులో తలదూర్చాడు.

# 2

రామన్న అసలు పేరు రామచందర్.

అందరూ రామన్న అనే పిలుస్తారు. అతడు హైస్కూలులో ఎనిమిదవ తరగతి చదువుతున్నాడు. రామన్న తండ్రి రత్తయ్య ఏమంత చదువుకున్న వాడుకాదు. పక్కనే ఉన్న ఫ్యాక్టరీలో సామాన్య కార్మికుడిగా పనిచేస్తున్నాడు. రామన్నతోపాటు ఆ ఇంట్లో మొత్తం ఆరుగురు పిల్లలు ఉన్నారు. అంటే ఆ ఇంట్లో మొత్తం ఎనిమిదిమంది ఉన్నారన్నమాట. తండ్రి తెచ్చే జీతం కొద్ది. వాళ్లందరూ దానితోనే బ్రతుకు ఈడ్చాలి.

ఇల్లు చాలా చిన్నది. అందరికీ ఇరుకు. దానిలోనే గడుపుకోవాలి. అది ఎండకు ఇల్లుగాని... వానకు ఇల్లు కాదు.

చంటివాడి గొడవ మూలాన రామన్న హోం వర్కు సరిగ్గా సాగటంలేదు.

"ఛీ! పాడుపిల్లవాడు." అని విసుక్కుంటున్నాడు. హోంవర్కు చేసు కుంటున్నాడు. వాళ్ల ఇంట్లో పెద్దవాడు రామన్నే. అందుకనే వాడిని చదివిస్తున్నారు.

మొదటినుండీ రామన్న చదువుకు చిన్నపిల్లలతో ఆటంకం ఉన్నది. ఏంచేస్తాడు. తప్పేదిలేదుకదా? రామన్న తమ్ముడు ప్రకాష్ మూడేళ్లవాడు. నిద్రలేచి వచ్చి రామన్న ప్రక్కనే చేరాడు.

ఇకచూడండి. రామన్న చదువు సాగితేనా? ఇద్దరితో గోల ఎక్కువ య్యింది. రామన్న ఉండబట్టలేక తమ్ముడి వీపుమీద ఒక్కటి చరిచాడు. వాడు గొంతెత్తి ఏడుస్తూ అమ్మకు ఫిర్యాదుచేయటానికి వెళ్లాడు.

అమ్మ ఇంట్లోనుండి వచ్చింది. "హూ! ఏమిటిరా! పిల్లలను ఇట్లా ఏడిపిస్తున్నావు?." అని కోపగించుకుంది.

ఇంకొక్కసారి అయితే రామన్నను పోట్లాడేదే! కాని... వాడు అప్పుడు చదువుకుంటూ ఉండబట్టి మెదలకుండా ఊరుకున్నది.

చంటివాడి గొడవ; ప్రకాష్ గొడవ వదిలేటప్పటికి రామన్న హోం వర్కు ఒక కొలిక్కి వచ్చింది. ఇంతలో "రామన్నా!" అంటూ అమ్మ పని పురమాయించింది.

బిందెతీసుకొని వీధి కుళాయి దగ్గరకు చేరుకున్నాడు. అక్కడి పరిస్థితి చూసేటప్పటికి గుండె బేజారు అయ్యింది.

అమ్మయ్యో! చాలా మంది నీళ్లకోసం "క్యూ" కట్టి ఉన్నారు. ఆ వాడకు అంతా ఉన్నది ఆ కుళాయి ఒక్కటే! అస్సలే నీటి కొరత అట. రోజూ ప్రొద్దున సాయంత్రం ఒక గంట మాత్రమే నీళ్లు వదులుతున్నారు. అందుకని ఎప్పుడు చూచినా కుళాయి దగ్గర రద్దీయే!

ఉస్సురంటూ బిందె తీసుకొని నిలబడ్డ రామన్నను "ఏరా! తమ్ముడూ నీళ్ల కోసం వచ్చావా?" అంటూ పలుకరించింది విజయక్క.

విజయక్క రామన్న ఇంటి పక్కనే ఉంటున్నది. స్వతహాగా చాలా మంచిది. రామన్న చదువుకొనే అబ్బాయి కాబట్టి వాడంటే ఆమెకు చాలా వాత్సల్యం.

"అవునక్కా! ఇంట్లో ఒక్క చుక్క మంచినీళ్లు లేవు. అమ్మ వంటపనిలో ఉంది. నన్ను పంపింది. నాకేమో బడికి టైము అవుతున్నది." అంటూ తన గోడు వెళ్లబుచ్చుకున్నాడు.

వాడి బాధ అర్థంచేసుకున్న విజయక్క "పట్టుకోరా! పట్టుకో!" అంటూ తనవంతు వచ్చినప్పుడు వాడిని పట్టుకోమన్నది. రామన్న నీళ్లు పట్టుకున్నాడు. విజయక్క మంచితనాన్ని తలుచుకుంటూ సంతోషంగా ఇంటికి సాగిపోయాడు.

# 3

త్వర త్వరగా ముఖం కడుక్కొని రామన్న స్కూలుకు వెళ్లటానికి తయారవుతున్నాడు. కాకి షర్టు, కాకి నిక్కరు. ఒక్కటే ఉన్నది. అదే రోజూ తొడుక్కొని ఆదివారం రోజు ఉతికి శుభ్రం చేయించుకుంటాడు.

"చాలామందికి చాలా జతల బట్టలు ఉంటాయుట. మరి తనకు ఒక్కటే జత ఉన్నది. దానినే రోజూ తొడుక్కొని వెళ్లాలి. మామూలుగ తొడుక్కునేవి కూడా ఒకే జత. షర్టునిక్కరూను. అవీ నూలువి. టెర్లిన్‌వి కొనమని ఎన్నోసార్లు అడిగాడు. ఏదీ కొనిస్తేనే గదా! 'అదేమని' అడిగితే డబ్బులు తిండికే చాలటంలేదట. ఇంకా మంచి బట్టలు ఎక్కడినుంచి వస్తాయి.

తనకేకాదు. తన ఇంట్లోని అందరికీ అంతే! ఎందుకని? తన కుటుంబంలోని సభ్యుల సంఖ్య ఎక్కువ అవటం వల్లనా?

ఇంతలో విజయక్క జ్ఞాపకం వచ్చింది. విజయక్క, మామ రాజన్న

ఇద్దరు. వారికి ఇద్దరే పిల్లలు బొద్దుగా... ముద్దుగా ఉంటారు.

మరి తన ఇంట్లోనేమో ఇందరు ఉన్నారు. అందరూ రోగాలూ... రొష్టులతో ముక్కుతూ, మూల్గుతూ ఉంటారు. అంతా బలహీనులే! వారిలో తాను ఒక్కడే కొస్త ఆరోగ్యంగా ఉన్నాడు.

విజయక్కా వాళ్ల పిల్లలకు మంచి బట్టలు ఉన్నాయి. తమకు అటువంటివి ఏ కోశానా లేవు.

వాడికి ఎంత ఆలోచించినా ఏమీ తట్టటంలేదు. వాళ్లకూ తమ తండ్రికి వచ్చినంతే జీతం వస్తుంది. ఊరిలో ఆస్తి ఉన్నదా? అనుకుంటే అదీ లేదు.

మరి ఎక్కడ ఉంది ఈ తేడా?

ఆలోచనలతో సతమతమవుతున్న రామన్నను అమ్మ... "ఏమిటిరా! బడికి వేళవుతుంటే అన్నం తినకుండా అట్లాగే ఉన్నావు" అంది కోపంగా.

రామన్న ఉలిక్కిపడి ఈలోకంలోకి వచ్చాడు.

అమ్మ పళ్లెంలో అన్నం పెట్టి చాప మీద ముక్కుతూ.... మూలుగుతూ... పండుకున్నది. అమ్మ ఆరోగ్యం సరిగ్గా ఉండదు. ఎప్పుడూ నీరసంగా ఉంటుంది. కొస్తంత పని చేస్తే అలసి పోతుంది. ఎప్పుడూ పాలిపోయినట్లు ఉంటుంది.

విజయక్క వచ్చి ఎప్పుడూ అమ్మను ఓదార్చుతూ ఉంటుంది. ఆసమయంలో "పిన్నమ్మా! ఎందుకమ్మా నీకీ భారం. ఉన్న పిల్లలు చాలరూ? ఇంకా కావాలా? చూడు ఈ కాన్పులతో నీఆరోగ్యం ఎట్లా పాడవుతున్నదో?" అంటూ హితవు చెప్పటం తాను విన్నాడు.

అన్నం పళ్లెం ముందుకూర్చున్నాడు. అన్నానికి ఆదరువు పచ్చి మిరప కాయల పచ్చడి. అదీ రాత్రి నూరింది. కూరగాయలులేక ఏమీ చేయలేదు. రామన్న ఒక్క ముద్దనోట్లో పెట్టుకున్నాడో లేదో... మంటకు అతడికి కళ్లనీళ్ల పర్యంతం అయ్యింది.

స్కూల్లో చదివిన 'పోషకాహార పాఠం'గుర్తుకు వచ్చింది. పోషకాహారం రోజూ తీసుకోవాలట.

దానిలో 'క్యారెట్, పాలకూర, టమేటో, బంగాళాదుంపలు, పాలు, పెరుగు, వెన్న, బియ్యం, గోధుమలు లేక రాగులు, పప్పులు, వేరుసెనగలు,

గ్రుడ్లు, మాంసం, డాల్డాలతో పాటు... నిమ్మకాయ, బొప్పాయకాయ, అరటి పళ్లు' ఉండాలట.

ఇన్ని పదార్థాలా? తమకు ఎక్కడినుండి వస్తాయి. కనీసం నెలకొక సారన్నా ఇవి ఉన్న తిండి దొరికితే నయం.

'ఇవిలేకనే ఏమో? తమ కుటుంబం అంతా ఎప్పుడూ నీరసంగా ఉండేది.' అని అనిపించింది రామన్నకు.

మంచినీళ్లు తాగి మంటనుండి తేరుకున్నాడు. ఎట్లాగో అన్నం తిని బడికి బయలుదేరాడు.

# 4

స్కూలు చాలా దూరంలో ఉంది.

బస్సు ఎక్కిపోయి రావాలి. బస్సు దగ్గరకు చేరుకున్నాడు. తనలాంటి వాళ్లు చాలా మంది బస్సుకోసం కాచుకుకూర్చున్నారు.

రెండు బస్సులు వచ్చాయి. కాని అవి ప్రయాణీకులతో క్రిక్కిరిసి ఉన్నాయి. అందువలన ఆగకుండానే వెళ్లిపోయాయి.

స్కూలు టైము అవుతున్నదని రామన్న తొందర పడుతున్నాడు.

అబ్బ! జనం! జనం...

విపరీతమైన జనం...

ఎప్పుడూ రోడ్ల మీద చీమల్లా జనం. బస్సులనిండా జనం. సైకిళ్ల పై జనం. నడిచిపోయే జనం... ఎక్కడ చూచినా జనమే!

మరి ఇంత మందిజనానికి ఆవైపునుండి ఉన్న బస్సులు చాలా తక్కువ. అందుకనే బస్సులు ఎప్పుడూ రద్దీగా ఉంటాయి. తగినన్ని బస్సులు ఉంటే రద్దీ ఉండదేమో? మరి అన్ని బస్సులూ, అన్ని పొట్లా కావొద్దూ! ఎక్కువ బస్సులు నడపటం కూడా ప్రభుత్వానికి ఒక సమస్యే!

ఆలోచిస్తున్న రామన్నకు "బస్సు వస్తున్నది. బస్సు వస్తున్నది." అనే కోలాహలం వినిపించింది. అది కూడా క్రిక్కిరిసి ఉన్నది.

దిగేవారు ఇద్దరుముగ్గురు ఉన్నందువల్ల బస్సును అక్కడ ఆపాల్సి వచ్చిందేమో?

ఇక్కడ ఎక్కేవాళ్లూ చాలా మంది ఉన్నారు. 'ఈ బస్సుకు వెళ్లకపోతే... స్కూలు చెల్లు అయిపోతుంది. గేటు మూసి వేస్తారు.'

అని అనుకొంటున్నంతలో బస్సు వచ్చి ఆగింది. అక్కడ ఉన్నవాళ్లంతా బిలబిలలాడుతూ, ఒకరికొకరు తోసుకుంటూ బస్సులో జొరబడుతున్నారు.

వచ్చేటప్పుడూ, పోయేటప్పుడూ రామన్నకు రోజూ అది మామూలే! వాళ్లల్లోనుండి తోసుకుని ఎట్లాగో బస్సులో పడ్డాడు. ఈ హడావుడికి షర్టు అంతా నలిగిపోయింది.

ఎలాగో స్కూలు దగ్గరకు చేరాడు. క్లాసులోకి వెళ్లాడు.

క్లాసంతా కోలాహలంగా ఉన్నది. ఆరోజు మూడవ పీరియడు అయిన తరువాత "జనాభా విద్య" గురించి చెబుతారట. దానికోసం ప్రత్యేకంగా ఉన్న టీచర్లు వస్తున్నారట. పిల్లలకు అంతా ఉత్సాహంగా ఉన్నది.

ఆ ఉత్సాహానికి ఇంకొక కారణం కూడా ఉన్నది. జనాభా విద్యలో భాగంగా "సినిమా ప్రదర్శన" ఉండటమే ఆకారణం.

ఈ కోలాహలంలో వచ్చిన క్లాసు టీచరు 'హోం వర్కు సంగతే ఎత్తలేదు. అందరూ ఎదురుచూస్తున్నట్లుగానే మూడవ పీరియడు అయిపోయింది.'

నాలుగవ పీరియడు రానే వచ్చింది.

ఇంతలో హెడ్ మాష్టరుగారు ఎవరినో వెంటబెట్టుకొని వచ్చారు. వారే "జనాభా విద్య" గురించి బోధించే ఉపాధ్యాయులు.

"ప్రపంచంలో జనాభా విపరీతంగా 'ప్రేలి' పోతున్నది. ఉదాహరణకు ఈ ప్రేలుడుకు గురి అవుతున్న భారత దేశాన్నే తీసుకుందాం!"

"దేశానికి స్వాతంత్ర్యంవచ్చినప్పుడు జనాభా... 344 మిలియన్లు ఉండేది. ఇప్పుడో 700 మిలియన్లు అయ్యింది. అంటే రెట్టింపు పెరిగిందన్నమాట.

ఈ పెరుగుదలను జనాభా ప్రేలుడు 'అనుకుందాం!' దానివలన ప్రజలకు ఎన్నో కష్టాలు వస్తాయి.

తిండికొరత ఏర్పడుతుంది. అందరికీ పోషకాహారం దొరకదు. చాలినన్ని వస్త్రాలు దొరకవు. వాడే విద్యుచ్ఛక్తి... కావలసిన నీరు కొరత అధికంగా ఉంటుంది. విద్య ఉన్నా అందరికీ ఉద్యోగాలు దొరకవు. దీనికితోడు అధిక వనరులు ఎన్నో కావాలి.

అంతేకాకుండా కుటుంబ జీవనం కుంటుపడుతుంది. పరిసరాల పారిశుద్ధ్యం సరిగా ఉండదు. పైగా వాతావరణ కాలుష్యం ఏర్పడుతుంది. ఎన్నో సాంఘిక సమస్యలు ఎదురవుతాయి." అని వచ్చిన వారు చెప్పారు.

రామన్నతో పాటు పిల్లలంతా శ్రద్ధగా విన్నారు.

చూపిన సినిమాలు చూశారు.

రామన్నకు ఒక్కసారి తమకుటుంబ పరిస్థితులు కళ్లముందు కదులాడాయి.

తమ ఇల్లు ఇరుకు ఇల్లు.

ఉన్నవారికి చాలదు.

మంచి తిండికి తోడు బట్టలు లేవు. తమలాగే చుట్టూ ఉన్న జనములుకూడా! విజయక్కలాంటి ఒకరిద్దరు తప్ప సుఖంగా ఉన్నవాళ్లు ఎవరూలేరు.

దీనికితోడు అందరికీ విద్య లేదు. తమ ఇంట్లో తాను ఒక్కడే చదివాడు. మిగతా అందరూ నిరక్షరాస్యుల కిందే లెఖ్ఖ.

ఒకవేళ అందరూ చదివినా, అందరికీ ఉద్యోగాలు దొరకవు.

"అబ్బో! నిరుద్యోగమే! తనలాంటివాళ్లు బతికేదెట్లా?" రామన్నలో భయం ప్రవేశించింది.

జనం... జనం... జనం...

భయం... భయం... బ్రతుకు భయం...

తాను ఉంటున్న ప్రాంతంలోని ఇళ్లు క్రిక్కిరిసి ఉన్నాయి. అక్కడ అంతా 'పారిశుధ్యం' లేదు. ఇటువంటి ప్రాంతాలను మురికివాడలు అని అంటున్నారు. నగరంలో చాలాచోట్ల మురికివాడలు ఉన్నాయి. అక్కడా ఇదే పరిస్థితి.

అక్కడ ఉన్న వాళ్లే కాకుండా ఎందరో పల్లెలనుండి ఇంకా వస్తున్నారు. వాళ్లకందరికీ గృహాలు కావాలి. తమవాడ పక్క ఒక పెద్ద చెరువు ఉన్నది. దానిలో సగం ఇళ్లు లేచాయి. మిగతా సగంలో మంచినీళ్లకు బదులు ఫ్యాక్టరీలనుండి వచ్చే మురికినీరు చోటుచేసుకున్నది. దుర్గంధాన్ని వ్యాపింపజేస్తున్నది. అంతేకాకుండా దోమల ఉత్పత్తి కేంద్రంగా పనిచేస్తుంది.

వాతావరణం నిజంగానే కలుషితమై పోతున్నది. నీరుకూడా సరిగ్గా దొరకటంలేదని ప్రొద్దున నీళ్ళ పంపు దగ్గర దృశ్యమే చెప్పింది.

రామన్న చిన్ని బుర్రలో ఇన్ని ఆలోచనలు. బతుకు గురించి భయాందోళనలు.

దానికి అంతకీ కారణం 'అధికజనాభా! అబ్బో! అధికజనాభా! ఇదొక జబ్బులాగా ఉన్నదే! ఈ జబ్బు ఎంత చెడ్డది. సమాజాన్నే పాడుచేస్తున్నట్లున్నది.' అని అనుకున్నాడు.

వచ్చిన ఉపాధ్యాయులు చివరిసారి చెప్పారు.

తలచుకుంటే జనాభా పెరుగుదలను అరికట్ట వచ్చునట. ఆ బాధ్యత ప్రతి యువతీయువకుడిదట. తాముకాబోయే భావిపౌరులట. తమ కర్తవ్యం ఎంతో ఉన్నదట.

రామన్న అన్నీ శ్రద్ధగా విన్నాడు.

ఇంతలో ఆరోజుకు బడి వదిలారు.

రామన్న ఇంటికి బయలుదేరాడు.

# 5

బస్సు దిగి ఇంటికి వస్తున్న రామన్నకు దారిలో విజయక్క ఎదురయ్యింది.

"ఏరా! తమ్ముడూ! బడినుండి వచ్చేశావా? రా! రా! మాయింటికి వెళదాం!" అంటూ రామన్నను తన ఇంటికి తీసుకువెళ్ళింది.

విజయక్క పిల్లలు... మధు, రాజీ... రామన్నను వదల్లేదు. ముద్దుగా, బొద్దుగా కలలాడుతూ ఉన్నారు.

రామన్నకు తన ఇంట్లోని చెల్లెళ్ళు, తమ్ముళ్ళు జ్ఞాపకం వచ్చారు.

"ఎంత తేడా! పరిమిత కుటుంబంలో ఎంత హాయి ఉన్నది." అని అనిపించింది.

ఆవేళ పోషకాహార బిళ్లలు విజయక్క తయారుచేసిందట. రామన్నకు ప్లేటులో పెట్టి ఇచ్చింది. అవి తింటూ రామన్న పొంగిపోయాడు.

"భలే బాగా ఉన్నాయి అక్కా! ఎట్లా చేశావు?" అని అడిగాడు.

"ఆ ఏముందిరా! మామూలు వేరుసెనగపప్పుతోనే చేశాను. ఆ మధ్య మన వాడకు డాక్టరమ్మ వచ్చిందిగదా? ఇవి ఎట్లా తయారుచేయాలో నేర్పింది. అప్పుడప్పుడూ చేస్తూ ఉంటాను. ఆరోగ్యానికి మంచివని." అని చెప్పింది విజయక్క.

"మరి. అప్పుడు మా అమ్మకూడా డాక్టరమ్మ మాటలు విన్నది కదా? మరి మాకెప్పుడూ ఇటువంటివిచేసి పెట్టదే?" రామన్న అమాయకంగా అడిగాడు.

విజయక్క నవ్వింది. "పిన్ని సంగతిరా! నీవు చెప్పేది. అసలు ఆమెకు వంట్లో హుషారుగా ఉంటేనే కదా! ఎప్పుడూ నీరసంగా, ఉసూరుమంటూ ఉంటుంది. ఇక ఇటువంటివి కూడా చేసే ఓపిక ఉండవద్దూ! " అన్నది.

అమ్మ పరిస్థితికి రామన్నకు జాలివేసింది.

తనచుట్టూ నిత్య జీవితంలో జరిగే సంఘటనలు గుర్తుకు వచ్చాయి. తాము... తమతోటి వాళ్లు పడే ఇబ్బందులు కళ్లముందు కదులాడాయి.

'జనాభా సమస్య తెచ్చే చిక్కులు ఎన్నో! అబ్బా!' తలుచుకుంటే బతుకుమీద రోతవేస్తున్నది.

'ఏమయినా గాని, తాను పెరిగి పెద్దవాడు అయితే జనాభా సమస్యను సవాలుగా తీసుకోవాలి. పరిమితాన్ని పాటించాలి. తోటి వారికీ తెలియజెప్పాలి.' అని కృతనిశ్చయుడయ్యాడు రామన్న.

మెదలకుండా ఉన్న రామన్నను పలుకరిస్తూ విజయక్క "ఏమిటిరా తమ్ముడూ! ఏదో దీర్ఘాలోచనలో మునిగినట్లున్నావ్?" అని పలకరించింది.

"ఆ ! ఏం లేదక్కా! ఈ జనం. బతుకుకోసం సమరం. ఇవే ఆలోచిస్తున్నానులే! అదీగాక ఇవాళ మా స్కూల్లో 'జనాభా సమస్య' గురించి, సినిమాలు చూపారు. ఎన్నో విషయాలు చెప్పారు." అని అన్నిటినీ గురించి వివరించి చెప్పాడు రామన్న.

"భలేరా! తమ్ముడూ! మీలాంటి వాళ్లకు ఇప్పటినుండే జనాభా సమస్య గురించి చెప్పాల్సిందే! లేకుంటే లోకం ఏమికాను." అన్నది విజయక్క.

ఇంతలో రేడియోలోనుండి పాటవస్తున్నది.

"ముద్దుముద్దు బాలలు

ముద్ద బంతి పూవులు

ఇంటికిద్దరుండగ

కంటికెపుడు పండగ."

మధు, రాజి... ఆ పాటకు తగ్గట్లుగా గంతులు వేస్తూ ఆనందంగా ఆడుతున్నారు.

రామన్న... అదే రామచందర్...

బరువుగా నిట్టూర్చి... ఇంటివైపు కదిలాడు.

"ముద్దు ముద్దు బాలలు

ముద్ద బంతిపూవులు

ఇంటికిద్దరుండగ

కంటికెపుడు పండగ."

అదేపాట... చెవులు గింగుర్లు ఎత్తేటట్లు వినిపిస్తున్నది.

"అవును ఇంటికి ఇద్దరే! ఇద్దరు. విజయక్క పిల్లల్లాగా! రెండు కన్నుల్లాగా... ఉంటే ఎంతో మంచిది" అని అనుకున్నాడు రామన్న. *